# దళితుల చరిత్ర

(మొదటి భాగం)





లోకాయత ప్రచురణలు

లోకాయత ప్రచురణ నెం-**18**
ముద్రణ : 1991 ఏప్రిల్
ప్రతులు : 2000


# దళితుల చరిత్ర (మొదటిభాగం)

రచయిత : కత్తి పద్మారావు

ముఖచిత్రం : ప్రభు (ఉదయం దినపత్రిక)

వెల రూ **8.00**

కాపీలకు :

కె. చార్వాకుడు
లోకాయత ప్రచురణలు
పొన్నూరు 522 124
గుంటూరు జిల్లా

కె. ధనరాజు
'నాబార్డ్' క్వార్టర్స్
**D**-3 బజుల్లారోడ్
టి. నగర్ మద్రాసు

డా॥ వి. భాస్కరరావు
2/5 బ్రాడీపేట
గుంటూరు

ముద్రణ : సృజన ప్రింటర్స్, పొన్నూరు

దళితుల చరిత్ర రచనకు ప్రేరణాశక్తులు,

నిరంతరం శ్రమజీవులు నాతల్లి దండ్రులు

కత్తి సుబ్బారావు మాణిక్యమ్మలకు కృతజ్ఞతలతో

— అంకితం

# నా మాట

భారత ఉపఖండములో ఆదిమ జాతుల చరిత్రను క్రోడీకరించటం కష్టమైన పని. పాలక జాతులన్నీ దళితుల చరిత్రను శిథిలము చేసినాయి. దళిత జాతి చరిత్రపై, భాష పై, సంస్కృతి, కళలపై తీవ్రమైన దమన కాండ నిర్వహించటం వలన చరిత్ర గతుల్లోకి చొచ్చుకు పోయి వాస్తవాంశాలను ధృవీ కరించటానికి చాలా సమయము పడుతుంది. 1982 నుండి ఈ గ్రంధ రచనకు సంబంధించిన సమాచార సేకరణకు ఉపక్ర మించాను. భారతీయ సంస్కృతిలో 'స్త్రీ' అనేగ్రంథాన్ని రచించే క్రమంలో ఈ గ్రంథంకోసం కూడా అనేక గ్రంథాల యాలు చూశాను.

ముఖ్యంగా మద్రాసు 'కన్నెమెరా" గ్రంథాలయము, ఆంధ్ర యూనివర్సిటి గ్రంథాలయము, గుంటూరు ప్రాంతీయ గ్రంధా లయము, పొన్నూరు శ్రీ భావన్నారాయణస్వామి గ్రంథా లయము, తిరుపతి శ్రీ వెంకటేశ్వర యూనివర్సిటీ గ్రంథాల్లో ఈ రచనకు అవసరమైన గ్రంథాలు పరిశీలించాను. ముఖ్యంగా డా॥ బి. ఆర్. అంబేడ్కర్ రచనలు ఈ రచనకు ప్రేరణ కలిగిం చాయి. ఈ గ్రంథములో చిక్కుముడులుగా నున్న కొన్ని అంశాలలో నేనుచేసిన స్వతంత్ర నిర్ణయాలపట్ల మేధావులను చర్చకు ఆహ్వానిస్తున్నాను. ఈ గ్రంథాన్ని 5 భాగాలుగా బయ టకు తీసుకు రావాలను కొంటున్నాను. ఈ మొదటి భాగాన్ని వెలువరించటానికి పూనుకున్న లోకాయత గృహగ్రంథాలయం మద్రాసుశాఖ బాధ్యులు శ్రీ కత్తి ధనరాజు, అమృతరావులకు, గుంటూరుశాఖ భాధ్యులు డా॥ వి. భాస్కరరావు డా॥ కోటేశ్వరరావు గార్లకు లోకాయత గృహ గ్రంథాలయ సంస్థ ద్వారా దళిత సాహి త్యాన్ని ముందుకు తీసుకు వెళ్ళుచున్న డా॥ యం. చంద్రిన్ గారికి లోకాయత జీవిత సభ్యులకు కృతజ్ఞతలు తెలుపు కుంటూ

—మీ రచయిత.

# చారిత్రక పూర్వయుగంలో దళితులు

భారత సమాజ పరిణామంలో నిర్మాణంలో క్రియాశీలక పాత్ర వహించిన చారిత్రక శక్తులు దళితులు[1] ప్రపంచంలో అన్ని ఖండాల్లో మానవ సంస్కృతిని రూపొందించడంలో అనేక మానవ తెగలు నిర్వహించిన గణనీయమైన పాత్రనే భారత ఉపఖండంలో వీరు నిర్వహించారు. వివిధ ఖండాల్లో అక్కడ ప్రాచీన జాతులు ఏ విధంగా వలసదాడులకు గురై అణచివేతలో జీవిస్తున్నారో, దళితులు కూడా భరత భూమిలో అంతే అణచి వేతకు గురై 'అస్పృశ్యతనే' ఒక అమానుష భావంచేత బాధింప బడుతూ, ఆర్థికంగా, సాంఘికంగా, రాజకీయంగా పీడింపబడు తున్న ఒక బలమైన పీడిత వర్గంగా ఈనాడు విముక్తి పోరా టానికి సన్నద్ధులౌతున్నారు. చారిత్రక దశల్లో ఆయాకాలల్లో చండాలురుగా, అస్పృశ్యులుగా, అంత్యజులుగా అవర్ణులుగా శ్వపచులుగా పిలువబడుతున్న దళితులు చరిత్రగతిలో చెరిగిపోని ముద్రలను మిగుల్చుకో గలిగారు. అవే వారి చారిత్రక నిర్మా ణానికి ఉపకరణాలయ్యాయి.

---

1 'దళిత్' అనే పదం యొక్క అర్థం ఆక్స్‌ఫర్డ్ డిక్షనరీలో ఇలా వుంది. బద్దలైన, ఖండింపబడిన ముక్కలుగా వెదజల్లబడిన (Burst, Split, Scottered, dispersed, broken, Torn, As under destroyed, Crushed).

దళితులు భారతదేశ వ్యాప్తంగా జీవిస్తున్నారు. 5 లక్షల 60 వేల గ్రామాల్లో మొత్తంగా దళితులు వుండటం వలన దళితుల పరివ్యాప్తత అభివ్యక్తమతుంది. వీరికివున్న ఆదిద్రావిడ, ఆది ఆంధ్ర, ఆదిమళయాళివంటి పేర్లు వీరి ప్రాచీనతనునిరూపిస్తాయి. అన్ని గ్రామాలల్లో అగ్రకులాల్లో ఎన్నో మార్పులువున్నా వీరు మాత్రము ఒకే సామాజక లక్షణాలు కలిగి ఉండటం వీరి సాంఘిక వాస్తవికతను అభివ్యక్తంచేస్తాయి. భారతదేశంలో ప్రసిద్ధిచెందిన అన్ని జాతులకు సంస్కృతులకు వీరు పునాదిగా వున్నారు.

భారతదేశంలో చారిత్రకంగా ప్రసిద్ధి చెందిన జాతులు ఎన్నోవున్నాయి. అందులో ప్రసిద్ధి చెందిన తమిళజాతి, మళయాళజాతి, తెలుగుజాతి, ఒరియాజాతి, హిందీ, పంజాబీ, అస్సామీ, గుజరాతీ, నాగ, మిజో, మొదలగు ఎన్నో భాషా సంస్కృతుల సంబంధించిన జాతుల్లో అత్యంత కీలమైన మౌలిక భాషా సంపదను కలిగివున్నది దళితులే.

ఉదాహరణకు తెలుగు, తమిళం, కన్నడం, మళయాళం, ద్రావిడ భాషల్లో ప్రసిద్ధమైనది. ఆ భాషలకు ద్రావిడభాష మూలభాష. ఈ భాషా కుటుంబంలో మౌలికమైన భాషా సంపద ఆయా జాతుల్లోని దళితుల దగ్గరే నిక్షిప్తమైవుంది కావున ఆయా జాతులకు మూలమైన వారు వీరే అనేది మనకు సువ్యక్తమవుతోంది. అదే విధంగా ఉత్తర ప్రాంతంలో నివసించే జాతులకు కూడా మూలభూతులు దళితులే. భారతదేశానికి ఆయువైన మాతృస్వామ్య సంస్కృతి కూడా దళితుల్లో ఈనాటికి ప్రాణభూతంగా నిక్షిప్తమై వుండడం గమనించ తగిన విషయం.



చారిత్రక పూర్వయుగంలో

గిరిజనుల సంస్కృతిలో ప్రకృతిసిద్ధంగావున్న సంస్కృతి దళితుల్లో తరతరాల అణచివేతల ప్రభావము వలన శిథిల రూపంలో కనిపిస్తూవుంది. డా॥ బి. ఆర్. అంబేడ్కర్ తన పరిశీలనలో వెల్లడించినట్లు భారత దేశంలోని ప్రాచీన జాతులైన ఈ దళితులు గిరిజనుల వారసులే అనేది చారిత్రక సత్యం. నదీనాగరికత రూపొందక ముందు గ్రామరాజ్యం రూపొందక ముందు ఆహార సేకరణ దశలో ఆటవిక అనాగరిక దశల్లో భారత భూభాగంలో అనేక ప్రాంతంల్లో నివసించిన జనవాసాలన్నింటిలో ప్రకృతితో పోరాడి సామాజిక నిర్మాణంలో అత్యున్నత పాత్ర వహించిన చరిత్ర నిర్మాతలు దళితులే. భారతదేశానికి వలస వచ్చిన బలమైన రాజకీయ దండు ఆర్యులు, వీరిని శత్రువులుగా ప్రకటించి వీరి అణచివేతతోనే వారి రాజ్య విస్తీర్ణముడిబడివున్నదని భావించలేరు. మోర్గాను మానవజాతి పరిణామాన్ని గూర్చి చెబుతూ "మానవజాతి నాగరికత దశకుచెందిన వేళ్ళు అనాగరిక దశలోవుంటే వానికి బీజావాసం జరిగింది ఆటవిక దశలో, యుగయుగాలుగా వస్తున్న సంబంధపు చారలో ఒక పురోగతి వరుసలో అవి వరుసగా సంక్రమిస్తూ వస్తున్నాయి" అని వివరించారు.

భారతదేశంలోని మానవ జాతుల పరిణామాలను మనం పరిశీలించినట్లైతే, మానవజాతి పరిణామానికి సంబంధించిన ప్రాచీన పరిణామ దశలన్ని దళితుల్లో కనిపిస్తున్నాయి. మోర్గాను చెప్పినట్లు మానవజాతి పరిణామంలో జీవనోపాధి-ఆహారం, పాలనాంగం-ప్రభుత్వం, భాష, కుటుంబం, మతం, గృహనిర్మాణం, సంపద-కీలకపాత్ర వహిస్తాయి. అయితే ఈ దశలన్ని ఇప్పటికీ దళితుల జీవన విధానంలో నకు కనిపించడం వలన భారత దేశంలో మానవజాతి పరిణామ లక్షణాల దళితజాతు

ఉండం వలన డా॥ బి. ఆర్. అంబేడ్కర్ నిర్వచించినట్లు వీరు ఆది భారతీయులనేది నిర్ధారణ అవుతుంది. డేనిష్ పురాతన శాస్త్ర వేత్తలు నిర్వచించినట్లు శిలా, కాంస్య, ఇనుప యుగ లక్షణాలు కూడా భారత సమాజంలో ఆదిమ జాతుల్లోవున్నాయి. ఆది భారతీయులైన దళితుల్లో ఇవి కనిపిస్తున్నాయి.

మోర్గాన్ అటవిక యుగంనాటి లక్షణాలు ఈ విధంగా వర్ణించారు.

''సుదీర్ఘ కాలం సాగిన ఆటవిక యుగంలో మానవుడు సంపాదించిన విజయాలు గణాలు, ప్రాత్రీలు, తెగలుగా నిర్మాణం; జంట కుటుంబం; అని ప్రాథమిక రూపంలో ప్రకృతి శక్తుల ఆరాధన; ఏకపద భాష; విల్లు-అంబు, రాయి, ఎముకతో చేసిన పనిముట్లు; తీగ, వేముతో చేసిన బుట్టలు; చర్మపు వస్త్రాలు; పునలాన్ కుంటుంబం, స్త్రీ పురుష భేదం ప్రాతిపదికపై సంఘ నిర్మాణం; గుంపుగావున్న గుడిసెలతో గ్రామం; దోనెలు, పడవల నిర్మాణం; చెకుముడి పేడుతో ములికి తీర్చిన బల్లెం; యుద్ధానికిగద; మోటయిన చెకుముడి రాతి పనిముట్లు; రక్త సంబంధీకుల కుటుంబం; ఏకాక్షర భాష; ప్రకృతి దేవతారాధన నరమాంసాహారం; నిప్పునుపయోగించే పరిజ్ఞానం; సంజ్ఞలతో భాష; ఈ విషయాలను మానవుడు పొందిన క్రమంలోనే ఒక్కొక్కటే మినహాయిస్తూ వెనక్కి వస్తే మానవుని శైశవ దశకు వస్తాం. మానవుడు నిప్పునుపయోగించుకోవడం నేర్చుకున్న దశ అది దాని నుంచి చేపల్ని ఆహారం చేసుకో గలుతాడు. అక్కడి నుంచి తాను పుట్టినచోటు వదలి బయట పడగలుగుతాడు. అప్పుడే నోటమాట వచ్చింది ఈ ఘట్టంలో మానవుడు పరిణామ క్రమంలో

అట్టడుగు మెట్టులో వున్నాడనాలి. అతనికి మెదడుంది కాని అభివృద్ధి క్రమంలో వచ్చిన ఆలోచనలు-నైతిక నియమాలకు, కల్పనలకు అన్వేషణలకు సంబంధించిన ఆలోచనలు, అవేవీ దానిలో ప్రవేశించలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే అతడు అట్టడుగు మెట్టుమీదనే వున్నాడు, అయితే భవిష్యత్తులో విజయాలు సాధించగల శక్తి అతనిలో వుంది" మోర్గాన్ పైనవివరించిన పద్ధతిలో మనం దళితుల్ని పరిశీలిస్తే. సామాజికరూపంలో గణ పద్ధతి, ఉమ్మడి కుటుంబపద్ధతి, ప్రకృతిశక్తుల మాతృస్వామిక దేవతల ఆరాధన మనకు దళితుల్లో ఇప్పటికి కనిపిస్తున్నాయి. తరువాత కాలాల్లో భారత దేశానికి వలస వచ్చిన సంస్కృతము ఆంగ్లభాషల ప్రభావం ఈ సంఘాల మీద అంతగా లేదు. ఆయా సామాజిక వ్యవస్థలో చరిత్ర పూర్వదశలో ఏర్పడిన భాషలే ఇప్పటికీ ఆచరణలో వున్నాయి. విల్లుని గిరిజనులు ఇప్పటికి వాడుతున్నారు. రాయిని దళితులకు ఆయుధంగా వాడే అలవాటుంది. అట్లాగే కృష్ణదేవరాయలు మాలదాసరిని వర్ణిస్తూ 'చమురైనతోలుకుబుసంబు ఇత్తడి శంకచక్రకుండలములమర' అని చిత్రించారు. క్రీ॥శ॥ 16వ శతాబ్ది వాడైన కృష్ణరాయల కాలంవరకు కూడా వీరు తోలువస్త్రాలు కలిగివున్నారనేది అర్ధమవుతుంది. గుంపుగావున్న గుడిసెలలో జీవనం మోర్గాన్ వర్ణించిన పద్ధతిలోనే ఇప్పటికి వున్నది.

మోర్గాన్ వర్ణించిన ఆటవిక దశల్లోని మూడంచలు ఆసియా ఖండంలోని భరతఉపఖండంలోని దళితులకు సరిపోతున్నాయి కాబట్టి ఆర్యులకు ముందు సమాజ తొలిరూపాల్లో ఈనాటిగిరిజనులు దళితులే ఇక్కడ నివసించారనేది చారిత్రకంగా మనకు అవగాహన అవుతోంది.

ఈ ఆటవిక దశ ఎంతో సుదీర్ఘ కాలం నడిచింది. భారత దేశంలో మొట్టమొదటి సామాజిక నిర్మాతలు దళితులే. సామాజిక రూపాలైన గణరూపం, తెగరూపం, ఉమ్మడి కుటుంబరూపం అన్నీ దళితుల సాంఘిక వ్యవస్థలో ఈ నాటికీ ప్రతిఫలిస్తున్నాయి.

ప్రకృతితో పోరాడిన మానవ సంస్కృతి రూపకల్పనకు ఎంతో శ్రమించిన మానవుడు తానొక సమాజంగా రూపొందడం లోనే విశిష్టతను కలిగియున్నాడు. గణసమాజం, జంటకుటుంబం వరకు వచ్చిన పరిణామాలు అన్నీ ఈనాటి గిరిజనులలో దళితుల్లో కొట్టవచ్చినట్లు కనబడుతున్నాయి. మరి ముఖ్యంగా మాతృ స్వామ్య సంస్కృతి పునాదిగా వీరి పరిణామం జరిగింది. ప్రకృతి దేవతారాధన ఇన్ని మతపరిణామాల తరువాత కూడా వీరిలో నిలిచిపుంది. గిరిజనుల దేవతలందరూ స్త్రీలే. దళితుల దేవతలు కూడా స్త్రీలే పోలేరమ్మ, మాచకమ్మ, పెద్దమ్మ, గంగానమ్మ, అంకాళమ్మ వంటి నూటొక్క దేవతల్ని ఇంకా గ్రామాల్లో ఆరాధి స్తున్నారు. ఆదిమ సామాజిక వ్యవస్థా నిర్మాతలు దళితులే అనే విషయాన్ని ఈ మాతృస్వామిక లక్షణాలు నిరూపిస్తున్నాయి. కుటుంబానికి తల్లి ప్రధాన శక్తిగా ఉండడం మాతృస్వామ్య లక్షణం ఈ లక్షణం ఇంకా గిరిజనుల్లో, దళితుల్లోనే కనిపిస్తుంది. సంతానంపై తండ్రి ప్రభావం కంటే తల్లి ప్రభావమే దళితుల్లో మెండు. సాంస్కృతిక వారసత్వం తల్లినుండే వీరికి సంక్ర మిస్తుంది. కొన్ని సంవత్సరాలు వీరు తల్లిపాలు విడవ కుండా త్రాగటం వలన వీరికి తల్లికి ఆత్మీయ అనుబంధం ప్రగాఢంగా కొనసాగుతాయి. పితృస్వామిక లక్షణం వీరిపై తక్కువ ప్రాథమిక సమాజనిర్మాత తల్లికనుక కుటుంబ నిర్మాతగా, నిర్వాహణ కర్తగా తల్లితన శక్తి సామర్థ్యాలను కుమ్మరించి ముందుకు నడుపుతుంది.

'ది మదర్స్' అనే గ్రంధంలో రాబర్ట్ బ్రిఫాల్ట్ ప్రాధమిక మానవ సమాజాల రూపకల్పన గురించి విశ్లేషిస్తూ ప్రాధమిక మానవ సమాజాల రూపకల్పనలోను, కుటుంబ నిర్మాణంలోను స్త్రీలదే ప్రధానపాత్రని వ్యాఖ్యానించారు. ఈ నాటికి స్త్రీలు ప్రధాన పాత్రవహిస్తున్న తెగల దళితుల జీవనవ్యవస్థ అతి ప్రాచీనమైనదని, వారి మాతృస్వామికతే మనకు నిరూపిస్తూ వుంది. తల్లిప్రేమ అనేది మానవ సమాజంలోనే కాదు జంతు ప్రపంచంలో కూడా విశిష్టతను సంతరించుకొన్నది. అన్ని జంతు జాలములలోను 'తల్లి" బిడ్డ సంబంధాలే మిగిలివున్నాయి. కాని "తండ్రి' పాత్ర అక్కడేమిలేదు. మానవ సమాజం జంతుసమాజ పరిణామంలో భాగమే. మానవ సమాజానికి సంబందించిన బీజాలన్ని మనకు జంతుసమాజంలో దొరుకుతాయి. మోర్గాన్ మాతృస్వామ్య వ్యవవస్థ మీద ప్రతిభావంతమైన పరిశోధనలు చేశాడు. 'తల్లి' సమాజానికి మూలమని, తల్లితనం సమాజానికి ఆయువని ఆయన తన పరిశోధనల్లోనిగ్గు తేల్చాడు. ఇటువంటి "తల్లి' తనంగలిగిన తెగలు ఏ సమాజంలోనైనా చారిత్రక పూర్వదశకు సంబంధించినవని ఆయన తేల్చాడు. దీనినిబట్టి భారత ఉపఖండంలోని గిరిజనులు దళితులు భారత సమాజంలోని ప్రాధమిక జాతులనేది మనకు సామాజిక శాస్త్రజ్ఞులు నిరూపించిన అంశం.

భారతదేశ ఆటవిక గణ సమాజం భాషకు స్థిరరూపాన్ని ఇవ్వగలిగింది. ఆర్యులు భారతదేశానికి రాకముందే గిరిజనులు ఆయా తెగలలో భాషకు సంబంధించిన తొలి దశలన్నిదాటి ఒక నిర్దిష్టతను రూపొందిచుకున్నాయి. భాష సంఘజీవితం నుండి

పుట్టి సమాజిక పరిణామంలో అది పరిపుష్టి చెందినది. ప్రపంచంలో ఆయా జన సమూహాలను పరిశీలించి భాషా శాస్త్రవేత్తలు భాషా కుటుంబాలను నిర్ణయించారు.

సంకేతముల నుండి భాషలు ఉద్భవించేవని కొందరి వాదము. ప్రాచీన మానవుడు తన భావములను వెల్లడించుటకు కరచరణాద్యవయవముల నొక పద్ధతిలో కదపెడివాడు. దానితో పాటుగా 'ఏ, ఓ,' మున్నగు ధ్వనులు కూడా చేసెడివాడు. ఆ ధ్వనులు మరియు సంకేతములు నేటి భాషకు మూలరూపము లని వారి అభిప్రాయము. ఈ వాదమును "పూ పూ" వాద మందురు. గిరిజన దళిత జాతుల్లో తమ భావములను పద సమ్దాయం కంటే కూడా ఎక్కువగా కరచరణ చలనం నుండే భావ వ్యక్తీకరణ చేసే గుణంవున్నది. ఈ వాదమునుబట్టి భాషోత్పత్తిలో కూడా వీరి పాత్రగణనీయం.

అనుకరణము నుండి భాషలు పుట్టినవని కొందరు శాస్త్రవేత్తలు చెబుతున్నారు. మానవుడు ప్రకృతిని జంతుజాలమును అనుకరిస్తాడు కాబట్టి వాటి ధ్వనులను అనుకరించి భాష ఉత్పన్నమైనదని ఈ వాదము దీనికి "బౌ బౌ" వాదమని పేరు. ఈ అనుకరణ లక్షణాల పశుపక్ష్యాదులలో కలిసి నివసించే గిరిజనులలో దళితులలో ఎక్కువగా కనిస్తున్నాయి. మాక్స్‌ముల్లర్ 'డింగ్ డాంగ్' వాదమును ప్రతి పాదించాడు. ప్రకృతి అంతా లయాత్మకమని ప్రతి పదార్థాము ప్రకంపములను కలిగియుండునని యు ఈ ప్రకంపనములకు అనుగుణముగనే శబ్దము వ్యక్తినోట వెలువడునని ఈ వాద సారాంశము అంతేగాక సామూహికంగా ఒక తెగ జనులు తమపని పాటలలో ఉపయోగించుకొన్న ఆ ధ్వనులే క్రమముగా అర్థవతములై భాషారూపము ధరించెనని



చారిత్రక పూర్వయుగంలో

కొందరివాదము. దీనిని 'మాస్క్యులర్ " వాదమంటారు. ఈ వాదాలన్నింటిలో కొన్ని లోపాలున్నా కొన్ని సుగుణాలు ఉన్నాయి. ఈ భాషోత్పత్తి వాదాలను పరిశీలిస్తే - భారతీయ భాషలు రూపొందే కాలం నాటికి నివసించిన గిరిజనులు దళితులు ఈ భాషలను రూపొందించారనేది స్పష్టమవుతుంది.

దీనికి ఒకటే మనకు ఉదాహరణ. సంస్కృతంలోని ఋ.ౠ ఌ, ౡ. ః. ఖ, ఛ, ఠ, థ, ఫ, ఘ, ఝ, ఢ, ధ, భ, , ఞ, శ. ష, అను అక్షరాలు భారత దేశంలో నివసించే ఆర్యేతరులు ఉచ్ఛరించక పోవడమే.

సంస్కృతేతరమైన భాషలుమాట్లాడే భారతీయగిరిజనులు దళితులు భారతీయ భాషాసంస్కృతికి వారసులు. సంస్కృతము గ్రీకు, లాటిన్, కెల్టిర్, గోతిక్ మొదలైన భాషలన్నీ ఆర్యభాషా కుటుంబానికి సంబంధించినవని విలియమ్ జోన్స్ పేర్కొన్నారు. ఉత్తర దేశంలో ప్రసిద్ధిచెందిన, సింధీ లహందా. పంజాబీభ షల మూలపదాలను గుజరాతీ, రాజస్తానీ, ప్రాచ్యహిందీ, బీహరీ, ఒరియా, బెంగాలి, అస్సామీ, మరాఠీ భాషల మూలాలను పరిశీ లిస్తూఆయా భాషా ప్రాంతాలలోవున్న గిరిజనుల, దళితుల భాషా రూపాలను పరిశీలించినట్లైతే సంస్కృతం ప్రభావం భారతదేశ భాషల మీద ఎంతపడిందీ. సంస్కృతేతరంగా ఈ భాషల, జాతుల మూలాలేవో మనకు సుబోధమవుతొంది. ద్రావిడ భాషా కుటుంబం స్పష్టంగా సంస్కృతేతరమైనదిగా నిరూపింపబడినది. రాస్మస్‌రాస్క్ ప్రాన్సిస్ డబ్ల్యు ఎలిస్, బిషప్ కాల్డ్వెల్ అను వారలు పరిశోధించి ఈ భాషా కుటుంబమును కనిపెట్టిరి ఈ భాషా కుటుంబమునకు సంస్కృత భాషకు ఎట్టి సంబంధంలేదని

వారు అత్యంతపరిశోధనల ద్వారా నిరూపించారు. ఈ కుటుంబంలో ఇరువది రెండు భాషలున్నాయి. బ్రాహూయిా, కూడుఖ్, మాల్తో ఉత్తరద్రావిడ భాషలు, కుయి, కువి, కూవి, మండ, పర్జి, నాయికీ, పెంగొ, కోలామి, గోండీ, గదబ, తెలుగు మధ్యద్రావిడ భాషలు, తమిళం, మళయాళం, కొడగు, బడగ, తొద, కన్నడం, కుట, దక్షిణ ద్రావిడ భాషలు ఈ భాషలు మాట్లాడే ప్రజలు ఆర్యేతరులు. వింధ్య పర్వతాల యివతల నివసించే భాషా ప్రజలందరూ ఆర్యేతరులే.వారి సంస్కృతి చరిత్ర నిర్మాతలు దళితులే.

భాషల గురించి ఇంత వివరం ఎందుకు ఇవ్వవలసి వచ్చిందంటే భాష ఒక జాతికి సంస్కృతికి మూలకేంద్రం అవుతూ వచ్చింది. ద్రావిడులు ఆర్యేతరులని ఆర్యుల గ్రంథాలే నొక్కి ఒక్కాణించాయి. ఆంధ్రులు స్పష్టంగా ఆర్యేతరులుగా పేర్కొనబడ్డారు. ఇక ద్రావిడ భాషల్లో అనాగరిక భాషలుగా చెప్పబడుతున్న భాషలను స్పష్టంగా ఈ నాటికీ దక్షిణ భారతము నందలి గిరిజనులే మాట్లాడుతున్నారు. 'తొద" అనే భాషను నీలగిరికొండలలోని తొద అనేతెగకు చెందిన జనులు మాట్లాడు తునట్లు కర్నల్ మార్షల్ అనే పండితుడు నిరూపించాడు. కోత అనే భాషను మాట్లాడు ప్రజలు నీలగిరియందే వున్నారు. కన్నడ భాషను అనాగరిక ప్రాచీన మాండలికముగానే భావించారు.

This language may be considered as a very old and very rude dialect of the cannadese, which was carried by a persecuted low caste tribe at some very remote period. అని పేర్కొన్నారు. నీలగిరికొండల్లో కోత భాషతో బాటు తొద బడగ, ఇరళ, కురుంబ భాషలు మాట్లాడే ప్రజలు వున్నారు. వీరందరు గిరిజనులు. వీరందరిలో సమాజ పరిణామానికి సంబంధించిన తొలి రూపాలు మనకు కనిపిస్తాయి.

మోర్గాన్ వర్ణించిన ఆటవిక సామాజిక లక్షణాలు భారత దేశంలో 'ఆర్యులు' భారత దేశానికి రాకముందు ఇక్కడ నివసించిన గిరిజనుల్లో ఈనాడు దళితులుగా చెప్పబడుతున్న వారిలో స్పష్టంగా కనిపిస్తున్నాయి.

సమాజ రూపాలైన తెగ, గణ, ఉమ్మడి కుటుంబ రూపాలను కాని మాతృస్వామిక భాషా వ్యవస్థలను కాని పరిశీలించినట్లైతే భారత భూభాగంలో అతి ప్రాచీన కాలంలో ఆటవిక యుగకాలంలో ఆది భారతీయులుగా జీవించింది గిరిజనులు. ఈనాడు అస్పృశ్యులుగా నెట్టబడిన దళితులు అనేది స్పష్టమైనది అయితే ఇక్కడ మనకు కొన్ని ప్రశ్నలు ఎదురవుతాయి. భారత దేశంలో వున్న ఈ తెగలన్నీ ఒకే జాతిగానే వున్నాయా? గిరిజనులకు దళితులకు అంతరం ఎప్పుడు వచ్చింది? ఈ ఆటవిక తెగలన్నీ ఒక భాషా సంస్కృతుల్లో ఎందుకు జీవించలేదు? ఈ ప్రశ్నలకు సమాధానాలు చెప్పుకునే క్రమంలో మనకు విషయం ఇంకా స్పష్టం అవుతుంది.

భారత దేశంలోనే కాదు ప్రపంచం మొత్తంలో మానవ జాతి అభివృద్ధి చెందిన క్రమం అంతా ఒకటే, అయితే మానవ సమాజంలో ఆదిమకమ్యూన్ వ్యవస్థ అంతరించి ఒక వర్గాన్ని మరొకవర్గం దోచుకోవవడం ప్రారంభమైన తరువాత దోచుకునే వర్గానికి, దోయబడే వర్గానికి సంస్కృతిలో జీవన విధానంలో తేడావచ్చింది.

భారత దేశానికి ఆర్యులు ఇక్కడ నివసిస్తున్న తెగల మీద ఆధిపత్యంవహించాలనే ఉద్దేశ్యంతో రావడంతో మౌలికమైన తేడా వచ్చింది. ఆర్యుల మద్దతుదారులైన చరిత్రకారులు చరిత్రను వక్రీకరిస్తూ వచ్చారు. అందుచే భారత దేశంలో ఆదిమ జాతు

లైన దళితులు అస్పృశ్యులుగా ఎందుకు ముద్ర వేయబడ్డారనేది వీరి చరిత్ర వివరించ లేదు. వీరి చరిత్రవైదిక సంస్కృతిని కీర్తించింది. ఆర్యేతరులను కించపరుస్తూ వారికి చరిత్రలో స్థానం లేకుండా చేసింది. అందుకే దళితుల చరిత్రను వాస్తవాంశాల నుండి పునర్నిర్మించడం ద్వారా దోపిడీశక్తుల వక్ర చరిత్రను అర్థం చేసుకొని ఆది భారతీయులైన దళితులు ఎందుకు ఈనాడు అస్పృశ్యులుగా చెట్టబడ్డారనేది తెలుసుకోవాలి. అపుడు దళితుల విముక్తి పోరాటానికి సరైన మార్గం రూపొందక తప్పదు.

ఈ పరిశీలనలోనే మనకు గిరిజనులకు దళితులకు వున్న తేడా కూడా వివరణకు వస్తుంది. ఇకపోతే భౌగోళికంగా ఎంతో వైవిధ్యమున్న భారత భూభాగంలో కొండలు, లోయలు, నదీ నదాల తీరాల్లో గుంపులుగా. గణాలుగా తెగలుగా దీర్ఘకాలం జీవించడం వలన ఒకతెగ మరొకతెగ కలిసి జీవించే భౌగోళిక పరిస్థితులు లేనందువలన మానవ సమాజ గణాలే విభిన్న తెగలుగా ఆయా భాషా సంస్కృతులలో అభివృద్ధి చెందాయి. అందువల్లనే ఆయాగిరిజన తెగలలో జీవన వైవిధ్యం కన్పిస్తోంది అంతే గాని ఒక తెగకు మరొక తెగకు అస్పృశ్య భావం ఎప్పుడూ లేదు మనం పరిశీలించిన అటవిక యుగంలో అస్పృశ్యతా భావం భారత భూభాగంలో లేదని తేలింది. అనాగరికయుగ అటవిక యుగ నిర్మాతలు ఆది భారతీయులైన దళితులు, గిరిజనులని, తేలింది. మోర్గాన్ వివరించినట్లు అనాగరిక యుగంలో ప్రధా వాంశాలు

1. జంతువుల్ని మచ్చిక చేయటం
2. ధాన్యాలను కనుగొనడం

3. నిర్మాణాలకై రాళ్ళనుపయోగించడం
4. ఇనుము కరిగించటం

వీటికి ముందు ఆటవిక జీవన సంక్షోభం నుండి మానవుడు ఎలాబయటపడ్డాడో ఎన్ని పోరాటాలు నిర్వహించాడో, ఆ చరిత్ర అద్భుతమైనది. క్రూరమృగాలను నిర్జించగలిగి నిప్పును స్వాధీనం చేసుకొని ఆటవికయుగాన్ని అధిగమించడానికి ఆటవిక మానవునికి చాలా కాలం పట్టింది. భారతదేశ ఆటవిక తెగలు ఆర్య తెగల నాగరికత కంటే పెక్కు విషయాల్లో ముందున్నాయి ఆర్యతెగలు నిప్పును ఆరాధించే దశలో ఉన్నపుడు భారతదేశం లోని తెగలు నిప్పును సొంతంచేసుకొని ఉపయుక్తం చేసుకొనే దశకు చేరాయి. 'నిప్పు' మానవ సమాజ ప్రగతిని ముందుకు తీసుకుపోయింది. ఇప్పటికీ దళితులు గిరిజనులు నిప్పు కణికలను చేతితో పట్టుకొంటారు. దళిత స్త్రీలు నిప్పుకణికలను చేతితో ఎత్తి ఉడుకుతున్న అన్నం కుండమీద వేస్తారు.

ప్రాచీన దళిత జాతులు నిప్పుతో అడవులు కాల్చి భూమిని రూపొందించారు. ఆటవిక దశనుదాటి అనాగరిక దశ మలుపు తిప్పిన కీలకదశ. జంతువులను మచ్చిక చేయుదశ. సామాజిక శాస్త్రవేత్తలు మొదట కుక్కను మచ్చిక చేసుకొని వుండవచ్చు అని భావిస్తున్నారు. వేటాడే దశలోనే జంతువుని మచ్చిక కూడా చేయవచ్చునని ఆటవిక మానవుడు గమనించాడు. అయితే భారతదేశపు తెగలలో, దళితులలో ఈ లక్షణాలు పరిశీలిస్తే పుష్కలంగావున్నాయి. సంచార జాతులైన కోయ, బుడబుక్కల మొదలగు వాళ్ళు కుక్కలు, కోళ్ళు, గాడిదలు అన్నీ వెంటబెట్టుకొని వెళుతూ వుంటారు. మరీ ముఖ్యంగా దళితుల ఇండ్ల పేర్లు

కుదురులనుండి వచ్చినవే. ఆ ఇండ్ల పేర్లలో కాకులోళ్ళు కుక్కల, నక్కల, పందుల, దున్నల, పిల్లి అన్ని మచ్చిక చేయబడిన జంతువుల పేర్లు వున్నాయి. ఇది మనకు ఒక ఉదాహరణ మాత్రమే. ఇప్పటికీ గ్రామాల్లోని దళితుల ఇండ్లు. కోళ్ళు, కుక్కలు, పిల్లుల మయం. జంతువులను పెంచని ఇండ్లు వుండవు. జంతువులను మచ్చిక చేయడం పెంచడం వారి జీవన విధానంలో ఒక భాగం. అందువలన భారతదేశంలో అనాగరిక యుగంలో జంతువులను మచ్చికచేయు దశను నిర్వహించింది దళితులేన నేది చారిత్రకంగా మనకు ఋజువవుతున్న వాస్తవం.

రెండవ దశ అయిన ధాన్యాలను కనుగొనడం సేకరించడం అనే దశ మానవ పురోగమనానికి మూలమైనది ధాన్యం పండించడానికి ముందు దశయిది. అడవిని మానవ అవసరాలకు మలచినదశ ఇది. మానవుడు కాయ దుంపతిని ఏది మానవ వుపయోగం ఏది ఆకలి తీర్చుతుంది అని నిర్ధారించుకుంటున్న దశ ఇదే. అడవిలోని పుట్టతేనె దగ్గరనుండి అడవి దుంప దగ్గర నుండి ఆహార సేకరణ దశను నిర్వహించింది కూడా గిరిజనులు దళితులే. అందుకే కొశాంబి ఆహార సేకరణ దశనుండి ఆహార ఉత్పత్తి దశకు మారడాన్ని చరిత్రలో కీలకదశగా వర్ణించాడు. సామాజిక మూలసూత్రాలు ఆర్థిక ప్రాధాన్యతను సంతరించుకొంది కూడా ఈ దశలోనే. రాతి గొడ్డలినిచేసి చెట్లునరికిన దళితులే రాతిని గృహనిర్మాణానికి కూడా వాడుకున్నారు.

జంతువులను మచ్చిక చేయడం, ఆహారాన్ని సేకరించుకోవటం, గృహనిర్మాణంలో రాయిని ఉపయుక్తం చేయటం నేర్చుకున్న తరువాత భారతదేశంలోని తెగల జీవనం సుఖవం

చారిత్రక పూర్వయుగంలో

తం కావడం ప్రారంభించింది. నాగరికతవైపు వారి ప్రయాణం త్వరితమైంది. గృహనిర్మాణంలో స్థిరనివాసాలు, స్థిరనివాసాలతో పాటు స్థిరమైన జీవన విధాన అన్వేషణ ప్రారంభమైంది. ఈ అన్వేషణే వారిని ముందుకు నడిపించింది. ఆసియా భూభాగం లోని తెగలు అమెరికా ఖండంలోని తెగలకన్నా ఈ పురోగమ నంలో ముందున్నాయి. భారతీయ తెగలు ముందు ఇనుమును ఖనిజంగా కనుగొని ఆ తరువాత కరిగించడం, అచ్చుల్లో మూస పోయడం నేర్చుకున్నారు. 'ఇనుము'ను కనుగొనడంతోటే భారతదేశంలోని తెగలు వ్యవసాయ సంస్కృతికి చొచ్చుకు రావడంలో గిరిజనులనుండి చొరవగా ముందుకు చొచ్చుకు వచ్చినవారే దళితులు.

మానవ జాతిలో ఎంతో పురోగమించిన జనం కూడా ఒక్కొక్క దశకు వచ్చేసరికి వారి పురోగమనం నిలిచిపోతుంది అని మోర్గాన్ వివరించినట్లే భారతదేశ గిరిజనులు ఆహార సేకరణ దశ నుండి పోడు వ్యవసాయం దశకు పరిణామం చెందేటపుడు కొన్ని తెగలు పోడు వ్యవసాయ దశలో ఆగిపోతే కొన్ని తెగలు వ్యవసాయం దశకు చొచ్చుకుపోయాయి. ఈ వ్యవసాయ సంస్కృతిలోకి చొచ్చుకు పోయిన భారతీయ ఆదిమ తెగలే దళితులు. ఈ దశలోనే పోడు వ్యవసాయం దశవరకు వచ్చిన తెగలకు వీరికి అంతరం ప్రారంభమైంది.

## వ్యవసాయ సంస్కృతీ నిర్మాతలు దళితులు

ఇనుప లోహాన్ని కరిగించి ఇనుమును తీసిన దళితులు, దాని నుంచి లోహపు సమ్మెట, నాగలి రూపొందించుకున్నారు. ఇక గొడ్డలి, ఉలి, కర్రుగల నాగలి, ఇనుపకత్తి ఒకటేమిటి

వ్యవసాయ సంస్కృతికి మూలమైన అన్ని పరికరాలు రూపొందించుకున్నాడు. గొడ్డలితో అడవులను వేగంగా నరకగలిగాడు. నదీ ప్రాంతాల్లో భూమి చదునుచేసి ఇనుప కర్రు గలిగిన నాగలితో భూమిని దున్నాడు. అంటే భారత సమాజంలో ఒక గొప్ప పరిణామానికి వీరు ప్రధాన కారకులయారు.

ఇప్పటికీ దళితుడి ఇంట్లో గొడ్డలి, పార, పలుగు, కొడవలి నాగలి సహజంగా వుంటాయి. ~~ఈ~~నాటికీ భారతదేశంలో వ్యవసాయ భూమినిదున్నేవారు దళితులే. ఇనుము మానవ సమాజంలో గొప్ప పరిణామానికి మూల కేంద్రం అయ్యింది. ఇనుము భారతీయ సమాజంలో కీలక పరిణామానికి మూలభూతమైంది. ఆర్యేతరులైన ద్రవిడులు ఇనుపయుగవారసులని పి. టి. యస్ అయ్యంగారు వివరించారు.[1]

---

1 Tools of different shapes have been Collected from the graves of this Period. At a site on the Shevoroys in the Salem District Foote gets, '' alarge axe, a very fine bill-hook of large size with its handle in one place, a sharp sword and two javelin heads made with tangs instead of sackets. '' From some other place have been obtained axe heads, spear - heads and fragments of blades of small knives or small swords. The Iron axe - heads had a board butt end expanding into a rather leaf shaped blade. The method of fastening the iron axe - heads to their helves would seem to have been that adapted now - a - days or Certainly not very long ago, namely, of inserting the butt end of the axe - head into a cleft in a Piece of hand-wood with a couple of rings and a wedge to tighten the hold of the helve. The rings are placed on either of the butt end, and the wedge is driven tightly through the ring spaces and prevents the axe - head from slipping; but the lower

దళితుడు వ్యవసాయ భూమికోసం నదులు ప్రవహించే ప్రాంతాల్లో జనావాసాలను రూపొందించడానికి పూనుకున్నాడు. గిరిజన సంస్కృతి నుండి గ్రామ సంస్కృతికి మారే పరిణామానికి దళితుడు పూనుకోవడమే గాక, ఇనుమును వ్యవసాయానికి ఉపయుక్తం చేసి, నదీజలాలను పొలాలకు పారించి జనావాసాలను నిర్మించే కీలక పరిణామానికి దళితులు నిర్వాహకులుగా వున్నారనడానికి చారిత్రక ఆధారంగా దళితుల వ్యవసాయక జీవన విధానం మనకు స్పష్టంగా గోచరమవుతున్నది.

ప్రపంచంలో అనేక ప్రాంతాల్లో నదీ నాగరికతల దశ ఒకటి వున్నది. నైలునదీ నాగరికత, సింధూనదీ నాగరికత అని ఈ దృక్పథంతో పేర్కొన్నవే. నదీనాగరికతలో ప్రాథమిక దశలో నదీ జలాలను, అందు లభ్యమయ్యే జల చరాలను జీవన భృతిగా కలిగి వుండడం జరిగింది. నదీ జలాలలో ఈ నాటికి జీవన సంస్కృతిని పెనవేసుకుని వున్న 'జాలర్లు' దళితులలో భాగమే. జలచరాలైన-పీతలు, నత్తలు, రొయ్యలు, మట్టగుడిసెలు మొదలగునవి ఇప్పటికీ దళితులకు ఇండ్ల పేర్లుగా వున్నాయి. దళితులు, వలలతో, ఊతలతో, మావులతో, గాలాలతో చేపలు పట్టు

---

end also prevents the cleft in the helve from extending downwards. ' The shapes of bill-hooks and some other tools of the early Iron Age are exactly like those of the implements now in the hands of the village Gods.'It seems that the shapes of tools used for secular Purposes have changed with times in accordance with fashion and utility, but the weapons of gods have remained of the oldest fashions of tools, ' is the opinion ofP.T.S. Iyangar (see his Pre-Aryan Tamil Culture' P. 8)

కొని తినే అలవాటు ఇప్పటికీ కొనసాగుతుంది. జాలర్లతో పాటు బెస్తలతో పాటు భారతీయ తెగల్లో ఆదిమ జాతైన యానాదులు కూడా ఇప్పటికీ చేపలు పట్టడమే వృత్తిగా కలిగివున్నారు. చరిత్రను ఇలా వివరించుకోవడం సాంప్రదాయక చరిత్రను చదివిన వారికి విడ్డూరంగా కనిపిస్తుంది. గతి తార్కిక చారిత్రక భౌతిక వాద దృక్పథంతో భారతదేశ చరిత్రను అధ్యయనం చేయడమంటే సంఘర్షణలను అభివృద్ధులను పరిశీలించటం, సమాజం ఒక దశనుండి మరొక దశకు పరిణామం చెందడంలోని పైరుధ్యాలను ఉదాహరణకు ఆహార సేకరణ దశనుండి ఆహార ఉత్పత్తి దశకు చేరుకోవడంలో జరిగిన పరిణామాలు ఉత్పత్తి సాధనాల్లో వచ్చిన మార్పులు వాటివల్ల సమాజంలో ఆవిర్భవించిన కొత్త దశలోని ఉత్పత్తి సంబంధాలు ఎలా ఉండేవి వీటి రెండింటి మధ్య ఉత్పన్నమయ్యే ఘర్షణలు పరస్పర సంబంధాలను అధ్యయనంచేయుటమే. కొశాంబి 'ఏన్ ఇంట్రడక్షన్‌టు ది స్టడీ ఆఫ్ ది ఇండియన్ హిస్టరీ' అనే గ్రంథంలో చరిత్ర నిర్మాణాన్ని గూర్చి ఇలా వివరించారు.

'History is defined as the presentation in Chronological order, of successive developments in the means and relation of production' (page1)

కొశాంబి నిర్వచనాన్ని బట్టి శాస్త్రీయ పద్ధతిలో చరిత్రను అవగతం చేసుకోవాలనే వారు కూడా ఉత్పత్తి సంబంధాల్లో వున్న ఆర్థిక పరిణామాల వరకే పరిమితమయ్యారు కాని సాంఘిక సంబంధాల వేపు పెట్టవలసినంత దృష్టిపెట్టలేదు. ఈ లోపాన్ని డా॥ బి. ఆర్. అంబేడ్కర్ పూరించారు.

ఆహార సేకరణ దశ నుండి ఆహార ఉత్పత్తి దశకు సంబంధించిన ఉత్పత్తి సాధనాలు నాగలి, పార, గునపం రూపొందించిందివరో వారే వ్యవసాయ సమాజ నిర్మాతలు వీటిని రూపొందించుకొని ఉపయుక్తం చేసుకున్న శ్రామిక శక్తులు దళితులే.

వ్యవసాయంతో పాటు స్థిర నివాసం గ్రామం రూపొందించింది. వ్యవసాయం వలన అదనపు ఉత్పత్తి గ్రామంలో వివిధ వృత్తుల రూపకల్పనకు మూలమైంది. వ్యవసాయ సమాజం అనాగరిక దశ నుండి నాగరిక దశకు భారతీయ సమాజాన్ని నడిపించింది. మోర్గాన్ గ్రీకు వ్యవసాయ సమాజ నిర్మాణాన్ని ప్రతిభావంతంగా వర్ణించాడు కాని భారతీయ గ్రామ సమాసమాజ ఆవిర్భావం మీద పూర్తి వివరణ ఇవ్వలేదు. కొశాంబి వ్యవసాయ సమాజిక నిర్మాణాన్ని సామాజిక మహావిప్లవంగా వర్ణిస్తూ "మానవులు తెగలుగా కూడి జీవనం గడిపే నాటి గణ సీమల్లోకి వ్యవసాయక గ్రామ ఆర్థిక వ్యవస్థ విస్తరించడం భారతదేశంలో మొట్ట మొదటి సామాజిక మహావిప్లవం అది ఆహార సేకరణ నుంచి ఆహారవుత్పత్తి దశకు-అంటే, ఆటవిక గణ వ్యవస్థ నుంచి వ్యవసాయ సమాజానికి సాగిన పరివర్తన" అని వివరించాడు. గ్రామ సమాజానికి ప్రవర్తన చెందక ముందే వున్న రకరకాల కట్టుబాట్లు ఈ గ్రామ రాజ్యంలో ప్రతిఫలించాయి అంటాడు కొశాంబి "ఈ వ్యవస్థలోని కుల నామాలు, లైంగిక సంబంధాల్లో బాహ్యనిషేధం అంతర్నిషేధాలు, కులసభలు-సమస్థంగణవ్యవస్థ నుండి వచ్చినవే" ఈ వివణలో కొశాంబి వివిధ తెగలు వేటికవి అంతర్గత సమస్వామ్యాన్ని కలిగి ఇతరులతో

1 భారతచరిత్ర-పరిచయవ్యాసాలు డి.డి. కొశాంబి-పేజి 27

కలిసి వుండే విషయంలో విధి నిషేధాలు పాటించేవారని కొశాంబి వివరణ. ఆటవిక సమాజంనుండి అనాగరిక సమాజంలోకి ఒకతెగగా, గణంగా పరిణామం చెందిన భారతీయ గణవ్యవస్థ గ్రామ వ్యవస్థలోకి వచ్చేటప్పటికి విభిన్న తెగలు కలిసి జీవించ వలసిన పరిస్థితి ఎదురైంది. అప్పటికి ఆటవిక గణసమాజాల్లో 'కుదురు' కుండే సామాజిక లక్షణాల్లో మాత్రం మార్పురాలేద నేది కొశాంబి అభిప్రాయం ఇక్కడ కొన్నికొన్ని తేడాలు గ్రామ నిర్మాణంలో ఎదురైనాయి. ముందేవచ్చి స్థిరపడిన తెగలు ఆ గ్రామంలోకి వెనక వచ్చిన తెగలను కొంతన్యూనతగా చూడడం, అవసరమైతే ఇక్కడుండే వనరులు పంచుకోవలసి వస్తుంది కాబట్టి ఆ తెగతో యుద్ధం చేయటం, ఓడింపబడిన తెగ శిథిలమై గుంపులు గుంపులుగా చెదరిపోవటం, అంతకు ముందువున్న తెగకు ఆ తరువాత వచ్చిన తెగ పోటీగా ప్రక్కన నివాసం ఏర్పాటు చేసి కొని జీవించటం ఇలా ఆటవిక సమాజం అనాగరిక దశ నుండి గ్రామ నిర్మాణంలోకి పరివర్తన చెందే దశలో కొన్ని అంతరాలు ఏర్పడ్డాయి. కలిసి జీవిస్తున్న తెగలలో కూడా అంతకు ముందున్న గణవ్యవస్థల విధి నిషేదాలకు సంబంధించిన కట్టుబాట్లు గ్రామ వ్యవస్థలో కులవ్యవస్థకు పునాదిని వేసింది అనేది మనకు సువ్యక్త మవుతుంది.

భారతీయ సమాజంలో మనకు ఆశ్చర్యం కల్గించే అంశం సమాజ పరిణామానికి మూలమైన అన్ని వ్యవస్థలూ అన్ని దశలు మొత్తం భారత ఉప ఖండంలో కొనసాగుతూనేవుంటాయి.

గ్రామ నిర్మాణం వచ్చిన తరువాత ప్రభుత్వ భావన, ఆధిపత్య భావన అన్నీచోటు చేసుకున్నాయి. గ్రామ స్థిర నివా సంలో మానవుని జీవన విధానానికి కుమ్మరం, కమ్మరం, నేత,

గీత మొదలయినవన్ని అభివృద్ధి చెందటం ఒక్కొక్క వృత్తిని ఒక్కొక్క తెగ స్వీకరించటం వృత్తి కారుల వ్యవసాయం మూలంగా కలిగిన తెగలు యిచ్చి పుచ్చుకునే పద్ధతిలో సహజీవనం ప్రారంభమైంది. భారత ఉపఖండంలో కొందరు ఆటవిక జీవనంలో కొందరు అనాగరిక దశలో కొందరు గ్రామ జీవితంలో జీవిస్తున్న సంధి దశ చాలా సంక్లిష్టంగా నడిచింది. ఈ క్రమంలో గ్రామంలో వ్యవసాయ సంస్కృతి నిర్మాతలుగా వృత్తికారులుగా పరివర్తన చెందిన ఆదిమజాతులందరూ దళితులే అనే విషయం స్పష్టమవుతోంది. ప్రాచీన జాతులైన నిషాదులు భిల్లులనుండి చండాలురుగా చెప్పబడుతున్న దళితులు ఆవిర్భవించారని వీరే నేడు పంచములుగా పిలువబడ్డారని రోమిల్లాథాపర్ పేర్కొన్నారు. 1 ఇప్పటి వరకు విరుద్ధ తెగల మధ్యలోని సామాజిక వైరుధ్యాలే కాని అస్పృశ్యతా భావం అనేది రూపొందలేదు. ఇక్కడ కొంత వివాదం వుంది. చరిత్రకారులు ఈ భాగాన్ని రెండుగా వివరిస్తున్నారు. సాంప్రదాయక చరిత్రకారులు ఆర్.సి. మజుందర్ మొదలగువారు చరిత్రను ఈ పద్ధతిలో వివరించడం

---

1 This untouchables constituted the fifth major group. Their untouchability derived from their being considered polluting either because of their occupation as scavengers, such as candales and Doms and those who maintained the cremation grounds, or because they belonged to primitive tribes such as the Nisada and the Bhilla. Their speech was alien and their manner of life was strange. Even the Buddhists despised the candalas. The inequities of city life further aggravated the degradation of there groups, already declared impure on account of ritual pollution. (Ancient Indian Social History) [ROMILA THAPAR] Page - 45

లేదు. వారందరు సింధూనాగరికత నుండే వారి చారిత్రక విశ్లేషణను ప్రారంభిస్తున్నారు. సింధూనాగరికత తరువాత ఆర్యులు ఆ తరువాత సామ్రాజ్యాలు వాటి వివరణలు మాత్రమే వివరిస్తున్నారు. ఈ పద్ధతిలో వివరించడానికి పూనుకున్న కొశాంబీ వంటి వారు పశుపాలకులుగా వచ్చిన ఆర్యులు ఇనుపయుగాన్ని విస్తరింప చేశారంటున్నారు. అలాకాకుండా ఆర్యులు ఇనుపయుగంమీద పెత్తనాన్ని కైవసం చేసుకునే ప్రయత్నం చేసినట్లే మనకు చరిత్రలో కనిపిస్తుంది. వ్యవసాయ సంస్కృతి ప్రారంభమైన తరువాత గ్రామ సమాజం రూపొందే ప్రాథమిక దశలో ఆర్యులు భారతదేశానికి వచ్చారు.



# సింధూనాగరికత - దళితులు

'సింధూ' నది భారత ఉపఖండంలో ప్రసిద్ధమైనట్టిది. సింధూనదీ తీర ప్రాంతం ఎడారి. అందుకే నైలునదీ నాగరికత వలె ఇది ఉత్తరం నుండి సుమారు వేయి కిలోమీటర్లు పశ్చిమానికి విస్తరించింది. భారత దేశపు పవిత్ర గంగానది తీరంలో ఇంకా మానవ జనవాసాలు ఏర్పడని కాలమది. క్రీ. పూ. 3000 నాడు ప్రారంభమై 1700 సంవత్సరాల దాకా సాగిన నాగరికత. ఈ నాగరికతా నిర్మాతలు ఆర్యేతరులు అని చరిత్రకారులందరు నిర్ధారించారు. భారతదేశం మొత్తంగా కొన్నిచోట్ల రాతి యుగం లక్షణాలు, కొన్నిచోట్ల కంచు యుగం లక్షణాలు, కొన్నిచోట్ల ఇనుప యుగం లక్షణాలు ఉన్నకాలమది. ఆటవిక, అనాగరిక, వ్యవసాయక సమాజాలు పరిణామంలో కొట్టుమిట్టాడుతూ వున్న కాలమది. ఆకాలంలో సింధూనది ఒడ్డున మహానగరాలు ప్రవర్తిల్లాయి. అందుకే ఈ నగర నిర్మాణంలో కూడా రాతి, కంచు, ఇనుప యుగాల లక్షణాలు వున్నాయి. అయితే ఈ నగర నిర్మాణంలో భారతదేశంలో అప్పటికి అన్ని పరిణామాల్లో కీలకపాత్ర వహించిన దళితుల పాత్ర క్రియాశీలకంగా ఉన్నదనుటలో సందేహం లేదు.

రాయిని ఆయుధంగా గృహోపకరంగా చక్కగా వారు వాడుకున్నారు. సింధూనగర నిర్మాణంలో కంచుపాత్ర గణనీయంగావుంది. ఇనుము తప్పక ఇక్కడ వ్యవసాయానికి వాడి వుంటారు. మూడుయుగాల అభివృద్ధిలో అత్యున్నత శిఖరాలను

అధిరోహించిన ఈ నాగరికత ఒకటి వున్నదని 1925 జాన్‌మార్షల్ పురావస్తుతవ్వకాల్లో ఈ నగరాన్ని కనుగొనే వరకు భారతీయు లకు ఈ నగరం గురించి తెలియదు. అప్పటి వరకు హిందూ వలస వాద చరిత్రకారులు కేవలం గంగా పరివాహక ప్రాంతంలో క్రీ. పూ. వేయి సంవత్సరాల నాడు ఏర్పడిన 'పాటలీపు త్రాన్నే' మహా నగరంగా వర్ణిస్తూ వచ్చారు.

పురాతన శాస్త్రజ్ఞులు ఈ నగరాలను కళ్ళకు చూపించి వాటి కొలతలు పై శాల్యాలు వాస్తవంగా కొలిచి చెప్పినప్పటికీ భారత దేశంలో అప్పటికే స్థిరపడిన హిందూ పురాణ వాదులు చాలా కాలం నమ్మలేదు. ఈ మహానగరాలు సింధూనది లోయలో వెలిశాయి. దక్షిణాన సింధూనదీ తీరంలో మొహంజదారో, ఉత్తరంగా పశ్చిమ పంజాబ్‌లో రావినది ఒడ్డున హరప్పనగరం వెలిసాయి.

నగర నిర్మాణం అత్యద్భుతంగా వుంది. రోడ్లను 9 నుండి 34 అడుగుల పొడవున తీర్చిన ట్లుకట్టారు. కొన్ని చోట్లు అరమైలు పైగా వీధులున్నాయి. మురుగు కాల్వల నిర్మాణం, బావులు, దీపస్తంభములు సుందరంగా అమర్చబడివున్నాయి. కాల్చిన ఇటుకలతో కూడిన భవనాలు మంచికలుపతో రకరకముల చదును రాళ్ళతో కల్పనల్లో మనం చూసిన పురవర్ణనలు మరిపించే వాస్తవ దృశ్యాలు అక్కడ కనిపిస్తున్నాయి. 39 అడుగుల పొడుగు, 23 అడుగుల వెడల్పు, 8 అడుగుల లోయ కలిగిన స్నానాగారాలు మెట్లు గలిగి, స్నానం చేయువారు బట్టలు ధరిం చుటకు గదులు కలిగి సౌందర్యానికి సోపానంగా అమర్చి వున్నాయి.

అంతేగాక బార్లీ, గోధుమలు వంటి పంటలు అక్కడ ప్రజలు పండించినట్లు స్పష్టమవుతోంది. సింధూలోయ ప్రజలు రాగి లోహాన్ని, వెమళ్ళను, దంతాలను, దంతాలతో చేసిన దువ్వెనలు వంటి వస్తువులను ఎగుమతి చేశారు.

సింధూనగరాల్లో దొరికిన కుండలు పరికరాలు, ముద్రలు ఆనాటికి భారతీయులకు వాఙ్మయం, సాహిత్యం, లిపి, శిల్పం వున్నట్లు అభివ్యక్తం చేస్తున్నాయి. సింధూనగరాల్లో దొరికిన స్త్రీపూజార్తి - మాతృస్వామ్యవ్యవస్థ అక్కడ కొనసాగినట్లుగా గుర్తింప చేస్తుంది. మాతృస్వామ్య వ్యవస్థ, కంచు, ఇనుప యుగ లక్షణాలు ఇవన్నీ పరిశీలిస్తే భారతదేశం మొత్తంగా పరివ్యాప్తమైన దళితుల పాత్ర ఇందులో అగ్రగణ్యంగా వుందని ఊహించవచ్చు. భారతదేశ పరిణామాల్లో కొంత దూరం వచ్చాక ఆ పరిణామం వెనక్కు తిరిగే లక్షణం వుంది. ఈ విషయాన్ని విశ్లేషిస్తూ డి.డి. కొశాంబి-

"మొత్తానికి, ప్రాచీన భారత చరిత్రను సరికొత్త దృక్పథంతో అర్థం చేసుకోవలసివుంది. భారత సాంస్కృతిక పరిణామం సూటిగా, సరళరేఖలా జరుగలేదు. కొంత అభివృద్ధి చెందాక ఒక్కసారిగా తిరోగమించింది. తిరిగి పశుపాలక అటవిక దశకు చేరింది. అదనపు ఆహారం ఉత్పత్తి చేయగల విశాల భూభాగం లేకుండా హరప్పావంటి నగరజీవితం సాధ్యం కాదు. సాధారణంగా నగరం అంటే రాజ్య అధికార పీఠమే. ఒకటి రెండు నగరాలున్నాయంటే ఏదోరూపంలో రాజ్యం ఏర్పడి వుండాలి. కొందరు అదనంగా ఆహారోత్పత్తి చేసేవారు, మరికొందరు ఆహారోత్పత్తిలో పాల్గొనకుండానే దాన్ని ఉపయోగించి

ప్రజల కార్యకలాపాలకు నాయకత్వం వహించేవారు ఉండీ ఉండాలి. అంటే శ్రమ విభజన, వర్గవిభజన, విశాల ప్రజానీకం మీద కొద్దిమంది పెత్తనంవంటి లక్షణాలు లేకుండా నగరాలు వుండటానికి వీల్లేదు. మరి ఈ నగరాలు వారసులు లేకుండా, చరిత్రలో గుర్తులు కూడా మిగిల్చకుండా ఎలా అదృశ్యమయ్యాయి? ఈ నగరాలు శిధిలం కావడంతో పాటే, వాటి ప్రభావంతోనే వాటికి పోటీగానే మరికొన్ని నగరాలు తయారుకావాలికదా! ఇరాక్‌లో ప్రాచీన నగరాలను జయించినవారు, వాటిని ఆక్రమించుకుని జీవించారు. మొదట ఆటవిక దశలో జీవించి, తరువాత నగరాలను ఆక్రమించిన ఇలాంటి తెగలకు చెందినవాడే బాబిలోనియా రాజు స్మృతికర్త హమురాబీ (క్రీస్తు పూర్వం 17వ శతాబ్దం) పట్టణ నాగరికత ఈ విధంగా కొనసాగడమే సహజం ఈ సజహ పరిణామం భారత చరిత్రలో కనిపించదు. [1]

సింధూనాగరికతలో అధికార పీఠం రాజ్యంవున్నట్టు స్పష్టమైన దాఖలాలు లేవు కాని శ్రామిక వర్గపాత్ర లేకుండా లోహయుగ నిర్మాతలు లేకుండా సింధు నగర నిర్మాణం జరిగివుండదు. కావున సింధూనాగరికత నిర్మాణంలో దళితుల పాత్రవుంది. ఆనాటికి భరత భూమిలో అస్పృస్యతా భావం వుండడానికే వీలులేదు. 'అస్పృశ్యత' అనే పదం సంస్కృతంనుండి వచ్చింది. అస్పృశ్యతాభావం సంస్కృత సంస్కృతి నుండి వచ్చింది.

కావున వీరు అస్పృశ్యులుగా పిలవడం అన్న సమస్యే లేదు. వీరు ఆనాటి సమాజంలో భాగస్వాములుగా వున్నారు. మరి ముఖ్యంగా మహంజదారో సంస్కృతిలో భాగంగా నడిచిన

---

1 భారత చరిత్ర డి.డి. కొశాంబి పేజి 51

ఆర్థిక సాంఘిక జీవితాన్ని పరిశీలిస్తే ఈ విషయం ఋజువవుతుంది. సింధునాగరికత గూర్చి వ్రాస్తూ భారతదేశ ఆర్క్యాలజీ డైరక్టర్ జనరల్‌గా చేసిన Madho Sarup Vats, అప్పటి ప్రజలు ఉపయోగించే వస్తుసామగ్రిని వివరించారు. వాటిని పరిశీలిస్తే మనకు ఆనాటి సాంఘిక జీవితం బొమ్మకట్టక మానదు చూడండి

"For their daily needs, the Indus people depended on a variety of tools, implements, and weapons, mostly of copper or bronze. From such tools as awls and needles, of which the latter were also made of gold and ivory; razors (p. I 111. 16) knives, and sickles, the knives being also made of chert flakes; goads, fish-hooks and gouges (p I. 111. 19, 20) the latter being sometimes fitted with strong alabaster handles: chisels (pl. 111. 22,24), which were of bare metal, shanked or tanged for handles and employed for manifold purposes; choppers and saws (pl. 111.14, 17. and axes, ploughshares, smoothing planes (pl. 111, 18) and flaying knives, which were found at the sites, an idea can be formed of the different facets of the life fo the Indus people. Simple axes of copper or bronze had a sharp, convex edge, tapering on both sides, and were either plain, or emphasized in the form of shoulders. Unfinshed double axes (pl. 111. 25) of a rather small size have also been found. The more developed, but late forms employed for hewing were the socketed axae and adze -axe (pl. 111. 15) A small granite celt, quite well finished, was found at Harappa associated with the early phase of the intermediate period." 1

1 The cultural Heritage of India page - 117, 118

ఇక్కడ వినియోగించిన వస్తుసామగ్రితో వివిధ లోహ ములతో పాటు వాటిని చేసిన 'కర్మకారులు' 'శిల్పులు' శ్రామి కశక్తులే, కత్తులుకుండలు, చేపలబుట్టలు, వంటివి శ్రమజీవుల చేత రూపొందినవి దప్ప రాజ ప్రసాదం అనదగిన భవనాలు గాని సమర రణంలో వుపయోగించారని చెప్పుతున్న ఆయుధంకాని, దివ్యాంశ సంభూతులుగా కొలవబడ్డ వ్యక్తులుగాని సింధూ నాగరి కతలో కనిపించరు. దీనిని బట్టి ఈ నాగరికత ఆదిభారతీయుల ఉమ్మడి శ్రామిక నాగరికత అనేది మనకు తేలుతూవుంది. చరిత్ర అంటే అక్కడవున్న వస్తు వివరణకాదు వాటిని వినియో గించిన జాతుల సామాజిక జీవన పరిణామమే చరిత్ర. ఆయా కాలముల్లో ప్రజలు ఉపయోగించిన ఉత్పత్తి పరికరాలను బట్టి అక్కడ ఉత్పత్తి సంబంధాలు వాటి మీద రూపొందిన రాజకీయ ఆర్ధిక సాంఘిక సమాజిక రూపాలు వాటి పరిణామాలు వుంటాయి. ఈ విషయాన్నే మార్క్సు తన Critiou of Political Economy లో విశ్లేషించారు.

"In the social production of their means of existence, men enter into definite, necessary relations which are independent of their will, productive relations which carre-spond to a definite stage of development of their material productive forces. The aggregate of those productive relationships constitues the economic structure of society, the real basis on which a juridical and political superstruc-ture arises and to which defrite forms of social comsciou-sness correspond. The mode of production of the material means of existence conditions the whole process of social, political and intellcetual life.

It is not the constiousness of men that determines their existence, but, on the contrhy, it is their tsocial existence that determines their consciousness.

చరిత్ర అంటే ఆర్థిక సంబంధాలను విశ్లేషించేదిగా కొందరు, చరిత్రంటే సంఘటనల సముచ్ఛయమని కొందరు విశ్లేషించారు. కాని చరిత్రంటే మానవ సంబంధంల్లో వున్న ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక రాజకీయ సంబంధాల విశ్లేషణే అయాకాలాల్లో ఒకొక్క సంబంధం ప్రధాన బోదకశక్తిగా ముందుకు వస్తుంది. అస్పృశ్యుల చరిత్రను రచించడానికి భారతదేశంలో మొదటిగా పూనుకున్న డా॥ బి.ఆర్. అంబేడ్కర్ నూత్న చరిత్రను ఆవిష్కరించేసమయంలో చరిత్ర కారుడు అనుసరించే పద్ధతిని గూర్చి 'గేడే' మహాశయుడు విశ్లేషణలను ఉటంకించాడు.

"అసత్యాన్నుంచి సత్యాన్ని, అనిశ్చితాన్నుండి నిశ్చయాన్ని, అనంగీకార యోగ్యమైన దాన్నుంచి సందేహాన్ని వేరు పర్చడం చరిత్రకారుని విధి. ప్రతి పరిశోధన తాను న్యాయస్థానం చేత నియమితమైన సభ్యునిగా భావించుకోవాలి. వాఙ్మ్యం ఎంత వరకూ సమగ్రంగా వున్నదీ. ఎంత వరకు స్పష్టంగా సాక్ష్యాదారాలమీద నిలబడింది అనేది మాత్రమే అతడు గమనించాలి. అప్పుడతడు నిర్ణయాలు చేసుకొని వోటువేస్తాడు. అతని అభిప్రాయం అగ్రసభ్యుని అభిప్రాయముతో ఏకీభవించినా, ఏకీభవించక పోయినా చింతలేదు.[1] " చరిత్రకు ఉపపత్తులు అసమగ్రంగా లభిస్తున్నపుడు చరిత్రకారుడు చేయవలసిన పనిని అంబేడ్కర్ ఇలా వివరించారు. "అవసరమైన సందర్భోచిత అంశాలు లభ్యమౌతున్నపుడు గేడే మహాశయుని నిర్దేశాన్ని పాటించడంలో యిబ్బందిలేదు, ఆయన చెప్పిన సలహా చాలా అమూల్యమైంది చాలా ఆవశ్యకమైంది. కాని ముఖ్యసంఘటనల మధ్య వాటి

---

1 అస్పృశ్యులెవరు- డా॥ బి. ఆర్. అంబేడ్కర్.

పరస్పర సంబంధాన్ని జోడించాడు. ప్రత్యక్ష సాక్ష్యాధారాలు దొరకనపుడు, తెగిపోయిన లింకులకు సంబంధించి చరిత్రకారుడు యేం చేయాలో గేడే చెప్పలేదు. ఇది ఎందుకు చెపుతున్నానంటే అస్పృశ్యత పుట్టుపుర్వోత్తరాలను కనుగొనే ప్రయత్నంలో పరిశోధనలు జరుపుతున్నపుడు నేను అలాంటి తెగిన లింకుల్ని ఎన్నింటినో ఎదుర్కొనవలసి వచ్చింది. అలాంటిది నాఒక్కడికే జరిగిన మాట నిజమే" - దళితుల చరిత్రను వ్రాయడానికి పూనుకున్న ఎవరికైన ఈ విధానం తప్పదనేది అంబేడ్కర్ వ్యాఖ్యానంలోనే ద్యోతకమయ్యింది.

సింధూ నాగరికత నిర్మాతలు దళితులే అని భారతదేశ చరిత్ర పరిణామంలో మనం నిరూపిస్తున్నపుడు మనకు ఎదురైన సమస్యకూడా ఇదే. అయినా సింధూనాగరికతలో దొరుకుతున్న ఆధారాలను బట్టి మనం ఆనాడు ఆ జీవన విధానంలో భాగస్వాములయ్యిందెవరో తేల్చవచ్చు. మొట్ట మొదటిగా పత్తి పండించింది సింధూవాసులే, "అనేకచోట్ల మట్టి కదుళ్ళు దొరికాయి కాబట్టి స్త్రీలు ఇళ్ళలో నూలువడికి ఉండాలి" అని రోమిల్లాథాపర్ వివరించారు. దీనిని బట్టి భారతదేశంలో నేతను దళితులే నేశారు. అనేక రాష్ట్రాల్లో దళితులు నేత వృత్తి గా కలిగివున్నారు. మన తెలుగు నేలలో కూడా దళితుల ఇండ్లలో మగ్గాలు ఈ నాటికి వున్నాయి.

ఇప్పుడు సాలీలుగా చెప్పబడుతున్న సవర్ణలు ఒకనాడు దళితులే రానురాను వాళ్ళు హిందూ సామాజికచట్రంలోకిపోయారు. నేత, పత్తిని తీయడం వంటి విషయాల మీద పరిశోధన చేస్తే వాటిని సృష్టించిన శ్రామిక వర్గాన్ని గూర్చి ఇంకాబయటబడ వచ్చు. దొరుకుతున్న ఆధారాల మేరకు సింధూనాగరికతలో

అశ్పృశ్యులెవరు ? — డా॥ బి. ఆర్. అంబేడ్కర్ పేజి 9

ఈనాడు అస్పృశ్యులుగా పిలవబడుతున్న 'దళితుల' భాగస్వామ్యం వుందనేది చారిత్రికసత్యం

అక్కడ ప్రజల జీవన విధానాన్నిగూర్చి రొమిల్లాథాఫర్ వివరణచూద్దాం 'ఉన్ని నూలు దారంవడకడం, బట్టలు నేయడం లో ప్రజలుతీరిక లేకుండా వుండే వాళ్ళు అక్కడ తయారైన వస్త్రాలు పర్షియన్ సింధూశాఖ తీరపట్టణాలకి, సుమేరుకి రవాణా అయ్యేవి. కుండలు తయారు చేసే వాళ్ళకి ఊపిరాడని పని. మట్టి పాత్రలు రమణీయంగా తీర్చిదిద్దారు. కుండలు, పాత్రల తయారీకి ఎర్రమట్టి వాడారు. ఎర్రటి పాత్రల పైన నల్లటి రంగులతో రేఖలు, చుక్కలు, రేఖాచిత్రాలు, చెట్లు, ఆదిజంతువుల బొమ్మలు గీశారు.

పూసలు,రక్షరేకలు ఆ ప్రజలకు చాలాఇష్టం త్రవ్వకాలలో ఇది చాలా విస్తారంగా దొరికాయి. పూసల్ని,మట్టితో, శిలతో.గుజ్జుతో, గుల్లతో, దంతంతో తయారుచేసారు. కమ్మర్లు ఊటెలు చాటులు, బాణపుమొనలు, గొడ్డళ్ళు, చేపలగాలాలు, క్షురికలు, మొదలైన పనిముట్లని ఆయుధాలని, రాగితో, కంచుతో తయారుచేస్తారు. ఇళ్ళలో వాడుకునే పాత్ర వల్చటి లోహపురేకుతో తయారుచేస్తారు. అవి మట్టిపాత్రల నమూనాలో ఉన్నాయి.' [1]

సింధూనాగరికత ప్రజలు వాడిన పూసలు, రక్షరేఖలు ఇవన్నీ ఇప్పటికి దళితస్త్రీలకు ఆభరణాలుగావున్నాయి. బాణపు మొనలు, గొడ్డళ్ళు, చేపలగాలాలు, క్షురికలు అన్నింటికి దళితుల ఇండ్లు ఇప్పటికీ నిలయంగా వున్నాయి. మట్టిపాత్రలు, కుండలు

1 తరతరాల భారత చరిత్ర - రొమిల్లాథాపర్ (పేజి-20)

వాడకం కూడ దళితులకు అలవాటు. రొమిల్లాథాపర్ క్రోడీకరించిన జనజీవన విధానం దళితుల జీవన విధానంతో ఈ నాటికి ప్రతిఫలిస్తుంది. ఇంతేకాదు మధో సరూప్ వాట్స్ సింధూ ముద్రలను పరిశీలించి ఇలా వర్ణించారు.

Besides pottery and metal implements, seals, statuary, and jewellery form major objects of their arts and crafts. The Indus seals and sealing may be divided into three classes: (i) large intaglio seals of steatite and terracotta, intended for making impressions (Pl.V); (ii) miniature seals or amulets of steatite, not intended for making impressions; and (iii) seals and sealings of terracotta or faience made from moulds with devices and inscriptions in relief. The seals of the second group and the tiny sealings of faience included in the third group are peculiar to the earlier levels of Harappa, and were probably carried about as amulets. They are characterized by the absence of any knob or hole and of the animals found on the seals of the first group, by an archaic type of writing, and by a limited range of inscriptions which are not infrequently repeated. In the order of frequency, those of the first group include square seals, with or without a perforated boss on the reverse; rectangular ones with convex back, perforated with one or two holes, or with plane back with or without a boss: cube seals thomboid seals with deeply indented edges; and discoid and T. shaped seals.

---

1 The Cultural Heritage of India (page-119)

సరూప్ వర్ణించిన దానిని బట్టి ఆనాటి ప్రజలు కుండలు చేయటంలోను, లోహసామాగ్రిని తయారు చేసుకోవటంలోను ముద్రలను చేయడంలోను ఆభరణాలు శిల్పించటంలోను విగ్రహాలు చెక్క డంలోను వారు సిద్ధహస్తులు.

వాళ్ళుతయారు చేసే ముద్రలు మూడురకాలుగా విభజించవచ్చు. గోధుమ వర్ణం కుండలమీద చెక్కిన ముద్రలు మరియు చిన్న చిన్న ముద్రలు చేశారు. కొన్ని ముద్రలు మూసబోసి తయారు చేసేవారు.

రెండువ మూడవ రకం ముద్రలు ఆభరణాలుగా ధరించే వారు. మొదటి ముద్ర మీద వున్న జంతువుల బొమ్మలుకాని రంగులుకాని రెండవ మూడవ ముద్రల మీద లేవు. రెండవ మూడవ వాటిమీద కొన్ని అక్షరములు కూడా వుండేవి.

చరిత్ర పూర్వయుగపు లిపి ముద్రలు వాటిమీద ఉండేవి. మొదటి ముద్రలు చతురస్రాకారంగాను, పాచీకారాంగాను T 'టి' అకారంగాను వుండేవి.

వీటిని బట్టి ఈనాటి కుమ్మరులు కుండల మీద బొమ్మలు వేయటం లంబాడీలు ధరించే ఆభరణాల్లోను సంచార జీవులుగా వున్న దళిత జాతుల్లో ఈ హరప్పా నాగరికత యొక్క వారసత్వం కనిపిస్తుంది.

సింధూనాగరికత కాలంలో అధికార చిహ్నలుగా ఈ ముద్రలను వాడడాన్ని బట్టి దళిత జాతులు అనాటి రాజ్యవ్యవస్థకు మూలమని తెలుస్తుంది.

ఆ నాగరికతంతా ఆర్యేతరంగా వుండడం గమనించదగిన విషయం.

" Of the language of these terts little more can be said at present than that there is no reason for connecting it in any away with,Sanskrit. The Indus civilization was Pre - Aryan, and the Indus language or languages must have been Pre - Aryan also.possibly one or other of them ( if, as seems likely, there was more than one )was Dravidie,[1]

ద్రావిడ సంస్కృతి, భాష దళితుల జీవన సంస్కృతిలో సజీవంగానిలిచి వున్నాయి. ద్రావిడభాషలలోని సంఖ్యాశబ్దాలను మనం పరిశీలించినట్లైతే, అన్ని భాషల్లోను వాటి సంబంధాలను అవి పలుకుతున్న వారిని పరిశీలిస్తే ద్రావిడ భాషలుమాట్లాడే ద్రావిడ జాతులకు దళితులేమూలశక్తులనేదిఋజువవుతోంది. అ సంబంధాలను పరిశీలిద్దాం అట్లాగే సామన్యంగా ప్రజలు వాడే పదాలు ఏవో ఆ శబ్దాలను తమ నిత్యవ్యవహారంలో ఉపయోగిస్తున్న వారెవరో పరిశీలిద్దాం

---

1 (History and philosophy of Lingayat Religion page-42)

| | తెలుగు | అరవము | కన్నడ | మలయాళ | కురుఖు | మాల్తో | కూయీ | గోండీ | బ్రాహు |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1. | ఒకటి | ఒణ్ణు | ఒన్ధు | ఒరు | ఒణ్టా | ఒర్త్ | రొవ్ది | ఉణ్డీ | అసిట్ |
| 2. | రెణ్డు | ఇరుణ్డు | ఎరడు | రణ్డు | ఎణ్డ్ | ఇర్ప్ | రిణ్డి | రణ్డ్ | ఇరత్ |
| ౩. | మూండు | మూణ్ణు | మూఱు | మూన్ను | మూణ్డ్ | తీన్ | మూఞ | మూణ్డ్ | ముసిట్ |
| 4. | నేను | నాన్ | నాను | ఞాన్ | ఏన్ | ఏన్ | ఆను | నన్నా | ఈ |
| 5. | మేము | నాఙ్గళ్ | నావుగళ్ | ఞఙ్గళ్ | ఏమ్ | ఏమ్ | ఆము | మమ్మాట్ | నన్ |
| ౬. | మనము | నామ్ | నావు | నామ్ | నామ్ | నామ్ | నామ్ | — | — |
| 7. | నీవు | నీ | నీను | నీ | నీన్ | నీన్ | ఈను | ఇమ్మా | నీ |
| ౮. | మీరు | నీఙ్గళ్ | నీవు | నీఙ్గళ్ | నీమ్ | నీమ్ | ఈరు | ఇమ్మట్ | నున్ |
| ౯. | కన్ను | కణ్ | కణ్ణు | కణ్ణు | ఖన్న్ | కనుత్ | కాను | కన్ | ఖన్ |

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 10. | చెవి | కాదు, సెవి | కవి | చెవి | ఖెబ్డొ | ెత్పుట్ | కిర్ఉ | కవీ | ఖవ్ |
| 11. | ముక్కు | మూక్కు | మూగ | మూక్కు | ముఈ | ముసొత్ | ముఘ్గలి | ముసోన్ల్ | బామున్ |
| 12. | పల్లు | పల్ | హల్లు | పల్లు | పల్ల్ | పలుత్ | పాల్కా | పల్ | దన్దాన్ |
| 13. | రా | వా | బా | వా | బార్ | బర | బాము | వరా | బర్ |
| 14. | పది | పత్తు | హత్తు | పత్తు | దస్సె | దస్ | దసు | దస్ | దహ్ |
| 15. | వా నోరు | వాయి | బాయి | వాయి | బై | తొరొవ్ | సుదా | టుడ్డా | బా |
| 16. | తల | తలై | తలె | తల | కుక్కు | తలిత్ | లెజ్గా | చుట్టీ | కొటుమ్ |
| 17. | వెండి | వెళ్ళి | బెళ్ళి | వెళ్ళి | రుపా | చన్దిత్ | నాద్రా | రుపా చాన్దీ | జర్ |
| 18. | అన్న | అణ్ణన్ | అణ్ణ | అణ్ణన్ | భాఇ | బయ | దాదా | తమ్ముర్ | ఈలుమ్ |
| 19. | తమ్ముడు | తంబి | తమ్మ | తంబి | బాఇ | బయ | దాదా | తమ్ముర్ | ఈలుమ్ |
| 20. | పెంటి (అడుది) | పెణ్ | హెణ్ణ్ | పెణ్ | ఆలీ | పెలివ్ | ఆసా | ఆర్ | జఖఫ |

హ్—1

1 ఆంధ్ర భాషా వికాసము 132వ పేజి

ఈ సంఖ్యా పదాలుకాని, ఈ నిత్యవ్యవహారిక పదాలు కాని ద్రావిడభాషాజాతుల్లోని దళితులు సంభాషిస్తున్నారు. ఇంకా బలహీన వర్గాలకు సంబంధించినవారు కూడా ఈ పదాలే మాట్లాడుతున్నారు. ఈ పరిశీలనను బట్టి సింధూనాగరికతను నిర్మించింది ఆర్యులకు ముందు భారత దేశంలో నివసించిన ద్రావిడులు మరి ఇతరజాతులనే చారిత్రకుల అభిప్రాయం ప్రకారం కూడా ద్రావిడ జాతి, వివిధ భాషాజాతులుగా చీలిపోవడం ఆ చీలిపోయినభాషలు స్వతంత్రంగా నిలదొక్కుకోవడం జరిగింది. ఆయాభాషలు మాట్లాడే ప్రజలకు పునాదిగావున్న దళితులు ఆభాషా సంస్కృతులను సంఘాలను. నడిపించే శ్రమ జీవులుగా వున్నారు. ద్రావిడులు చారిత్రక పూర్వదశలోనే భారతదేశానికి వచ్చారు. అప్పటికే భారతదేశంలో నివశిస్తున్న ప్రాచీన జాతులతో వారు మమేఖ మయ్యారు. నీగ్రిటోలు, ఆస్ట్రోలాయిడ్స్, మాంగోలాయిడ్స వంటి జాతులెన్నో భారతదేశానికి వలసవచ్చాయి. ఆయా జాతులు భారతదేశ జీవన పరిణామల్లో వైరుధ్యాలు సృష్టించలేదు. ఈ వైరుధ్యాన్ని పాటించి భారతీయుల జీవనవ్యవస్థను సంక్షుభితం చేసింది ఆర్యులే. అందుకే ఆర్యేతరులైన జాతుల, వారి జీవనపద్ధతుల్లో వచ్చిన పరిణామాల్లో వచ్చిన నగర సంస్కృతీ దశే సింధూనాగరికత.

దళితులు ప్రధాన శ్రమశక్తి నుండి నిర్మించిన ఈ నాగరికతపై దాడి చేసింది ఆర్యులు. ఆర్యులు అప్పటికి పశుపాలకులు, మధ్యేషియా నుండి వారు దండులు దండులుగా వచ్చారు. అభివృద్ధి చెందిన నాగరికతలను ఇతర జాతులు నాశనం చెస్తూ వచ్చాయి. అలానే ఇక్కడ సింధూ నాగరికతను నాశనం చేసింది వ్యవసాయంతో సంబంధంలేని జాతులు ఈ దాడిని నిర్వహిం

పాయి. దండయాత్రికులైన ఆర్యులు సింధూ నగరాన్ని నాశనం చేయడానికి రెండు పథకాలు వేశారు. ఒకటి నగరం మీద దాడి చేసి జనావాసాలను శిథిలం చేయడం రెండవది సింధూనగర సంస్కృతికి ఆయువు పట్టైన వ్యవసాయ సంస్కృతిని నాశనం చేయడం ఈ రెండు పద్ధతుల్లో వారు సింధూ నాగరికతను విధ్వంసంగావించారు. ప్రపంచంలోను మేరియన్ల, బాబిలోనియన్ల, అస్సీరియన్ల, పర్షియన్ల ఎవరి నాగరికతైనా వ్యవసాయసంస్కృతి మరి ముఖ్యంగా నీటి పారుదల సౌకర్యాలు నాశనమయ్యాకే ఆ నాగరికత నశించింది. ఆర్యులు వర్ధిల్లిన సింధూనాగరికతను నాశనంచేయడానికి కర్కశంగా విధ్వంసంకంగాను వ్యవహరించారు. అయితే సింధూలోయలో వీరికి ఎదురు నిలిచిన వారు దళితులే అందుకే దళితులను ఆర్యుల ఆగర్భశతృవులుగా భావించారు. ఇది దళితుల చరిత్రలో కీలకమైన యుగం. ఆయా ఖండాల్లో దేశాల్లో వలసవెళ్ళిన దాడులకు వెళ్ళిన జాతులకు ఎదురు నిలిచిన జాతులనే వారు శత్రువులుగా భావించటం జరిగింది. వారిపై తరువాత కాలంలో తీవ్ర దమనకాండ జరపడం కూడా జరిగింది. అదే పద్ధతిలో భారతీయ వారసులైన దళితులు ఆర్యులకు ఎదురు నిలిచి ఈనాటికి వారితో, వారి సంస్కృతిలో పోరాడుతున్నారు. ఈ పోరాటం ఐదువేల సంవత్సరాలుగా సాగుతూవుంది. ఆర్యులకు ముందే భారతదేశంలో ప్రధానజాతులుగా జీవించిన ద్రావిడులు, నాగులు, దస్యులు ఒకరేనా? ముందు పరిశీలించి, తరువాత ఆర్యులకు ఎదురు నిలిచిన ఆది భారతీయులు అస్పృశ్యులుగా ముద్ర వేయబడిన కీలక పరిణామాన్ని పరిశీలిద్దాం.

———

# ద్రావిడ యుగం

## (ద్రావిడులు నాగులు దస్యులు)

సింధూనాగరికతలో అత్యంత ప్రాధాన్యత వహించిన ద్రావిడులు భారతదేశానికి అతి ప్రాచీనకాలంలో వలస వచ్చిన ప్రాచీన జాతుల్లో ఒకరు. ద్రావిడులు అనే శబ్దం జాతి పరంగా భాషాపరంగా ఇపుడు వాడబడుతూవుంది. ఈనాడు దక్షిణభారత దేశంలో వ్యాపించివున్నట్లు కనిపిస్తున్న ద్రావిడులు ఒకనాడు ఉత్తరభారతంలో వ్యాపించినట్లు చారిత్రక ఆధారాలు కొల్లలుగా ఉన్నాయి. ద్రావిడుల ప్రాచీనతను "ది కల్చర్ అండ్ సివిలైజేషన్ ఆఫ్ ఏన్సియంట్ ఇండియా ఇన్ హిస్టారికల్ అవుట్‌లైన్" అనే గ్రంథంలో డి.డి. కోశాంబి ఇలా వివరించారు.

"Primitive man in India (we are told) must have been thrust in to the jungle by the Dravidians who took over the fertile lands. As a matter of fact, this fertile land was obviously covered with dense forest(or) swamp before the Iron age. Primitive man would live best in the thinner marginal jungle, not in territory now bearing the deeper, cultivated soil, that is the best localities for the food gath-ers were approximately where they are found today. The first cattle- breeders and food- producers had no need to push any one back. Finally, though the Dravidians are on

the whole darker than the Aryan - speaking people, there is no chance of correlating language and race, the Brahmins are not Dravidian's race, so far as I am aware of the results of modern anthropology,,1

భారతదేశములో ద్రావిడులు అతి ప్రాచీనులు. భారత దేశ మానవజాతి వర్గీకరణ కూడ వీరి ప్రాచీనతను జాతి లక్షణాలను స్పష్టం చేస్తున్నాయి. మానవ శాస్త్రజ్ఞుల మానవజాతి పరిశీలన ఆర్యేతర జాతులే భారతదేశంలో ప్రధానమైనవని నిర్ధారణ చేస్తున్నాయి.

## మానవ శాస్త్రజ్ఞుల విభజన-భారతీయ మానవ జాతులు

మానవ శాస్త్ర పరిణామాన్ననుసరించి మానవ శాస్త్రజ్ఞులు ఇండియా ప్రజలను ఆర్యులు, ద్రావిడులు, సింధియన్‌లు, మంగోలియన్‌లు వారి సాంకర్యముచే కలిగిన వారు అను ఐదు వర్గములుగా విభజించారు. ఆ విభజనను కాదని అనంతరము వెడిడ్ (ప్రాచీన భారతీయులు) మలనీడ్ (నల్లని భారతీయులు) ఇండీడ్ (క్రొత్త భారతీయులు) అను మూడు వర్గములుగా "వొకస్టెట్" భారతీయులను విభజించి, ప్రతివర్గములోను అవాంతర విభాగములను సూచించెను.

బి. ఎస్. గుహా 1931 జనాభా లెక్కల సేకరణ సందర్భమున చేసిన ఇండియా ప్రజల. వర్గీకరణమే అత్యాధునికమైనది. గుహా క్రింది విధముగా భారతీయులను విభజించారు.

---

1. The culture and civilisation of Ancient India ( In Historical out line ) D. D. Kosambe page - 41 (1977)

1. నార్డిక్ వర్గము (ఉత్తర ప్రదేశ్, పంజాబ్)
2. లెప్టర్న్ (బ్రాకీసెఫాల్, ఆర్మినాయిడ్)
3. పేలియా మెడిటేరియన్‌లు (దక్షిణఇండియా)
4. ప్రోటో ఆస్ట్రిలాయిడ్ (దక్కన్‌లోని ఆదిమ జాతులవారు)
5. మంగోలాయిడ్ (అస్సాం, నీఫాప్రాంతము, టిబెట్ బర్మాసరిహద్దు) ప్రాంతములు
6. నీగ్రిటోలు (దక్షిణ ఇండియా ఆదిమజాతులలోని కాడార్‌లు ఉరళీలు మున్నగు వారిలో నీగ్రిటో వర్గలక్షణములు ఉన్నాయి.)

గుహా అంతకుపూర్వమే జుకర్మన్ చరిత్ర పూర్వ, చరిత్ర ప్రారంభ యుగములనాటి మానవ కళేబరావశేషములను ఇండియా త్రవ్వకములలో లభించిన వాటిని పరిశీలించి, సరిగా నేడు వున్న మానవ వర్గముల వారే అనాడును ఇండియాలో నివసించుచుండిరని నిర్ధారణ చేశారు.

భారతదేశ ప్రజలను గురించి అధునాతన వర్గీకరణ హట్టన్ గుహ, మజుందార్‌చేశారు. 1931 జనాభా లెక్కల పర్యవేక్షకుడిగా వున్న హట్టన్ వర్గీకరణ, గుహ వర్గీకరణను పోలివుంది. ఆ వర్గీకరణను మనం పరిశీలిస్తే భారతదేశంలో ఆర్యేతర జాతులే ప్రాధాన్యాన్ని వహిస్తూన్నాయి.

## గుహ వర్గీకరణ (GUHA'S CLASSIFICATION)

1. నీగ్రిటోలు (Nigritos)
2. ప్రోటో ఆస్ట్రిలాయిడ్‌లు (Proto-Austroloids)
3. మంగోలాయిడ్‌లు (Mongoloids)

ఎ. పేలియో మంగోలాయిడ్‌లు (Palen-Maogoloids)
బి. డోలికో సెఫాలిక్ (Dolico-Cephelic type)
సి. బ్రాఖీ సెఫాలిక్ (Brachy Cephalic type)

4. మెడిటరేనియన్‌లు (Mediterraneans)
ఎ. పేలియో మెడిటరేనియన్‌లు (Paleo - Mediterraneans)
బి. మెడిటరేనియన్‌లు (Mediterraneans)
సి. ఓరియంటల్‌లు (Oriental type)

5. వెస్టర్న్ బ్రాఖీ సెఫాలులు (Western- Brachy Cephals)
ఎ. ఆల్ఫినాయిడ్‌లు (Alphinoieds)
బి. డైనారిక్‌లు (Dinarics)
సి. ఆర్మినాయిడ్‌లు (Armenoids)

6. నార్డిక్‌లు (Nardics)

ఇప్పుడు ఒక్కొక్క దాని గురించి క్లుప్తంగా తెలిసికుందాము.

1. నీగ్రిటోలు (Negritos)

శారీరక లక్షణాలు :- ఒంటి రంగు నలుపు, వెంట్రుకలు పొడవు లేదా పొట్టిగా కాని ఉండి చుట్టలు చుట్టలుగా చుట్టి వుంటాయి. శిరస్సు బ్రాఖి సెఫాలిక్ నుండి డోలక్ సెఫాలిక్. పెదవులు దళసరిగా ఉండడమే గాక ముందుకు చొచ్చుకొని వచ్చినట్లు వుంటాయి. శరీరపు ఎత్తు తక్కువగా ఉంటుంది.

2. ప్రోటో ఆస్ట్రోలాయిడ్‌లు (Proto- Astroloids)

శారీరక లక్షణాలు:- ఒంటి రంగు చక్కని గోధుమ వర్ణం నుంచి నలుపు, వెంట్రుకలు అలలు అలలుగా ఉండి ఉంగరాల

వరకు వుంటాయి. ముక్కు కొద్దిగా పెడల్పుగా వుండి మొదలు అణిగి వుంటుంది. శిరస్సు డోలికో సెఫాలిక్, శరీరపు ఎత్తు నీగ్రో లోల అంత పొట్టిగా వుండదు. ఈ జాతికి చెందినవారు ఒరవున్‌లు (Oraons), సంతాలులు (Santhals), భిల్‌లు (Bhills), ముండాలు (Mundas), కోల్సు (Kols), హో (Ho)లు. శారీరక లక్షణాల దృష్ట్యా వీరు ఆస్ట్రేలియాలోని ఆదిమ జాతులవలె ఉంటారు. అందుచేత వీరిని ప్రోటో-ఆస్ట్రలాయిడ్‌లు అని వ్యవహరిస్తారు. కొంతమంది అభిప్రాయం ప్రకారం ముండాలు, హోలు ఈ జాతికి చెందరు. ముండాలు ఈ మధ్యకాలంలోనే వచ్చినారని సర్కార్ తెలియజేసినాడు.

3. మంగోలాయిడ్‌లు : (Mongoloids)

శారీరక లక్షణాలు : దవడ ఎముక ప్రముఖంగా వుండడం, ముఖం చదునుగా ఉండడం, ముఖంమీద, శరీరం మీద వెంట్రుకలు అంతగా వుండక పోవడం, పై కనురెప్పకు ఎపికాంతిక్ మడత (Epicauthie fold) వుండడం వీరి లక్షణాలు.

మంగోలాయిడ్‌లను తిరిగి రెండు రకములుగా విభజించడం జరిగింది. పేలియో మంగోలాయిడ్‌లు, టిబెటో మంగోలాయిడ్‌లు.

4. మెడిటరేనియన్‌లు (Mediteranians) :

వీరిని 3వర్గములుగా క్రింది విధంగా విభజించినారు.

ఎ. పేలియో మెడిటరేనియన్‌లు (Paleo-Mediteranians)

వీరికి పొడవైన ఎత్తుతల, ముందుకు ఉబికిన నదురు, వెడల్పుగా వుండే చిన్న ముక్కు, సన్నని వెంట్రుకలు వుంటాయి. వీళ్ళరంగు కొంచెం నల్లగా వుంటుంది. శరీరపు ఎత్తు మధ్యరకం.

బి. మెడిటరేనియన్ : (Mediterraneans)

వీరి ఒంటి రంగు నలుపు నుండి గోధుమవర్ణము వరకు వుంటుంది. శరీరం మీద, ముఖం మీద రోమాలు దట్టంగా వుంటాయి. శరీరం ఎత్తు మధ్యరకం నుండి కొంచెం పొడవు. శిరస్సు డోలికో సెఫాలిక్ రకము.

సి. ఓరియంటల్‌లు : (Oriantaels)

ఈ జాతికి చెందినవారు యించు మించు పేలియో మెడిటరేనియన్‌లను పోలివుంటారు. ఈ జాతివారు రాజస్థాన్‌లోను, పంజాబ్‌లోను ఎక్కువగా ఉన్నారు.

5. వెస్ట్రన్ (బ్రాఖీసెఫాల్ (western Brachy Cephals)

వెస్ట్రన్ బ్రాఖీ సెఫాల్‌లను మూడు రకములుగా వర్గీకరించారు.

ఎ. ఆల్ఫినాయిడ్‌లు (Alphenoids)

వీరి ఒంటిరంగు తెల్లగావుండి, శరీరం మీద, ముఖం మీద వెంట్రుకలు దట్టంగా ఉంటాయి. వీరి ముక్కు ప్రముఖంగా కనబడుతుంది. ఈ జాతివారు ఎక్కువగా గుజరాత్, బెంగాల్‌లో వున్నారు.

(బి) డైనారిక్‌లు (Dynarics)

శరీర లక్షణాలు:- ఒంటి రంగు కొంచెం నలుపు. బ్రాఖీ సెఫాలిక్ శిరస్సు. శరీరపు ఎత్తు ఎక్కువ. ఈ జాతికి చెందినవారు ఒరిస్సాలో ఎక్కువగా ఉన్నారు.

(సి) ఆర్మినాయిడ్‌లు (Armenoids): వీళ్ళ రంగు కపిల వర్ణంగా వుండే తెలుపు. శీర్షము బ్రాఖీ సెఫాలిక్ రకం. ముక్కు సన్నగా పొడవుగా వుంటుంది. బొంబాయి ప్రాంతపు పార్శీలలో ఈ లక్షణాలు ఎక్కువగా వుంటాయి

నార్డిలు (Nordics) :

శారీరక లక్షణాలు :- ఒంటి రంగు ఎర్రని తెలుపు. డోలికో సెఫాలిక్ శీర్షం, ముఖం పొడవు, ముక్కు ఎత్తుగా. పొడవుగా వుంటుంది. కళ్ళు నీలిరంగుగా గాని, బూడిదరంగుగాని వుంటాయి. ఒక మాదిరి శరీరపు ఎత్తు వీరికి వుంటుంది. ఈ జాతికి చెందిన వారు భారతదేశపు పశ్చిమోత్తర ప్రాంతంలో వున్నట్లు గుహ భావించాడు

ప్రపంచంలో ప్రఖ్యాతిగాంచిన సామాజిక శాస్త్రవేత్తలలో ఒకడైన గోవింద సదాశివ్ ఘురేయ్ బొంబాయిలోనిఎమర్ట్స్ విశ్వ విద్యాలయంలో ప్రొఫెసర్‌గా ఎన్నో అమూల్యమైన పరిశోధనలు గావించారు. ఆయన ప్రసిద్ధ గ్రంథము 'క్యాస్ట్ రేస్ ఇన్ ఇండియా లో భారతదేశములోని మానవ జాతుల విభజనను గురించి ఇలా వివరించారు.

1. The Turko - Iranian of Baluchistan and North - West Frontier provinces. We do not discuss this type, because we think that it essentially lies outside cultural India.

2. The Indo - Aryan type of Kashmir, Punjab, and Rajputana. It is dolichocephalic with a narrow nose. We leave out other physical characteristics as they are far too vague

3. The Mongoloid type of the Himalayas, Nepal, Assam and Burma.

4. The Dravidian type extending from Ceylon to the valley of the Ganges and pervading the whole of Madras, Hyderabad, and the Central provinces, most of Central India and Chota-Nagpur. It was "probably the original type of the population of India." It is dolichocephalic with a "very broad nose."

5. The Aryo-Dravidian type of the United Provinces, Bihar and Ceylon. It is also found in parts of Rajputana. The head - form is long with a tendency to medium,

6. The Mongolo- Dravidian type of Lower Bengal and Orissa. "The head is broad, nose medium with a tendency to broad".

7) The 'Scytho-Dravidian type of Western India. "The head is broad, nosemoderately fine[1].

మానవశాస్త్ర సామాజిక శాస్త్ర పరిశోధకులైన గుహ, హట్టన్, మజుందార్, షురేయ్ మొదలగువారి పరిశోధనలను బట్టి ఆర్యేతరులైన మానవ జాతులే భారత దేశములో ప్రధానమైనవని ఋజువవుతున్నది.

---

1 Caste and Race in India - G. S. Ghurye. page 125, 126

## ద్రావిడులు - దస్యులు

ఆర్యులు తమ వాఙ్మయములో దస్యులను నిందించారు. దస్యులు, ద్రావిడులు ఒకరేనని కొందరి చరిత్రకారుల అభిప్రాయం. ఈ వాదాన్నే సమర్థిస్తు రాహుల్ సాంకృత్యాయన్ ఈ విధంగా వివరిస్తున్నారు.

"ఆర్యులు తమ విరోధులను దస్యులనేవారు. ఋగ్వేద కాలంలో (క్రీ॥ పూ॥ 1200) వారికి ముఖ్య శత్రువులు కొండలలోని దస్యులు. కాని మైదానంలోని దస్యులు కాదు. కొండల్లోని దస్యులు హిమాలయ కిరాతులే. వీరిని నాశనం చేయుటకు ఆర్యులు పూను కున్నారు. ఈ కృష్ణమేని దాసులను ఇంద్రుడు నాశనం చేసాడు. (2-20-7) ఇంద్రుడు కృష్ణత్వక్కులను (నల్లని చర్మం గలవారని) నాశనం చేసెనని పరుచ్ఛేపుడు చెప్పాడు (1-130-8) పరుచ్ఛేపుడు కొండదాసుల గొప్పరాజగు శబరుని జయించిన దివోదాసుకు పుత్రుడు. వశిష్టుడు వారిని "శిశ్నదేవు"లన్నాడు (7-21-5) శిశ్నదేవులంటే లింగ పూజకులు జార్థం వున్నరాతి లింగాలు మైదాన దస్యుల పురాతన నగరములైన మొహంజోదారో, హరప్పాలలో దొరికాయి."[1]

ఆర్యులు తమ శత్రువులుగా ప్రకటించిన దస్యులు ద్రావిడులు ఒకరే.

ద్రావిడులు - దస్యులు :

ద్రావిడులు - నాగులు ఒక్కటేనని అంబేడ్కర్ తన పరిశోధనాత్మక గ్రంథం "అస్పృశ్యులెవరు?" లో ప్రతిపాదించారు.

1. ఋగ్వేద ఆర్యులు -రాహుల్ సాంకృత్యాయన్ పేజీ 49

ఈ సందర్భంగా ఆయన ద్రావిడులు, నాగులు ఏవిధంగా ఒక్కటో నిరూపించడానికి భారతదేశ జాతుల సమస్యను, అందులో భాగమైన భాషా సమస్యలను పరిశీలించి ఆ చిక్కుముడులు విడదీశారు. ఈ సందర్భముగా అంబేడ్కర్ దక్షిణాపథంలో పండితుడిగా పేరుపొందిన "శ్రీ దీక్షితరాయ్" రామాయణంలో దక్షిణాపథం అన్న పరిశోధక వ్యాసంలో నాగుల విస్తరణను గూర్చి వ్రాసిన దానిని ఉదహరించారు.

" స్వభావరీత్యా అర్ధదైవాంశులు, సర్పం చిహ్నంగా కలవారు, మరొక జాతికి సంబంధించిన వాళ్ళు అయిన నాగులు భారతదేశమంతా వ్యాపించారు. పశ్చిమోత్తరాన తక్షశిలనుండి పూర్వోత్తరంలో అస్సాంవరకు, అక్కడనుండి దక్షిణాన దక్షిణ భారతదేశం, సింహళాల వరకు వ్యాపించారు. ఒకానొక సమయంలో వాళ్ళు మహాశక్తివంతులై వుండాలి. బ్రహ్మాశాయక్షులు పాలించిన కాలంలోనో లేకవారు క్షీణించిపోయిన తరువాతగానీ దక్షిణ భారతదేశంలో నాగులు ప్రసిద్ధికెక్కారు. సింహళములోని కొన్ని ప్రాంతాలేగాక, ప్రాచీన మలబారు ప్రాంతంకూడ ప్రాచీన నాగుల ఆధీనంలో వున్నది. క్రీస్తుశకం తరువాత తొలిశతాబ్దాలలో వ్రాయబడ్డ తమిళకావ్యాలలో నాగనాడు గురించి ప్రస్తావన అగుపిస్తుంది. నాగపూజ అవశేషాలు ఇంకా మలబారులో మిణుకు మిణుకు మంటూనే వున్నాయి. ఈనాడు కూడ దక్షిణ తిరువాన్కూరు జిల్లాలోని నాగర్ కోయిల్ దేవాలయం నాగపూజకే అంకితమైవుంది. వాళ్ళను గురించి చెప్పుకోవలసినదంతా ఏమంటే వాళ్ళు సముద్రియాన జాతి అని. నాగవనితలు సౌందర్యానికి ప్రసిద్ధి. క్రీస్తు శకారంభములో అధికారానికి ఎక్కివచ్చిన చేరవం

శంలో వాళ్ళు కలిసిపోయారు''. డా॥ అంబేద్కర్ ఈ విషయాన్ని బలపర్చడం కోసం శ్రీ సి. యఫ్. ఓల్డ్‌హామ్ సేకరించిన సమాచారాన్ని కూడ వివరించారు.

" ప్రాచీన కాలం నుంచి ద్రావిడ ప్రజలు చేర, చోళ, పాండ్యులుగా చీలిపోయి వున్నారు''.

ద్రావిడంలో చేరలేక సేర శబ్దం నాగశబ్దానికి తుల్యార్థకం. చేరమండలం అంటే నాగద్వీపం లేక నాగదేశం. దక్షిణపథ ద్రావిడులు అసురసంతతివారని ఇది స్పష్టంగా సూచిస్తున్నట్లు కన్పిస్తుంది. దీనికి తోడు, గంగానదీ మైదానంలో ఇప్పటికే చేరులు లేక శోరులు అని పిలుచుకునే ప్రజలు నివసిస్తున్నారు. వీరు తాము సర్పదేవతల సంతతిగా చెప్పుకుంటారు. చేరులు అతిప్రాచీనమైన జాతి. ఒకానొకప్పుడు వీరుగంగానదీ మైదానంలో విస్తృత ప్రాంతాన్ని ఆక్రమించుకొని వున్నట్లుగా విశ్వసించబడుతుంది. మనం యింతకుముందు చెప్పుకున్నట్లుగా యీప్రాంతాన్ని అతి ప్రాచీన కాలంలో నాగజాతులు ఆక్రమించాయి. మహ్మదీయ దండయాత్రలు సాగిన సంక్షుభిత కాలంలో చేరులు క్రమక్రమంగా తమ భూముల నుంచి తరిమివేయబడ్డారు. ఈనాడు చేరులు భూమి, పుత్రాలేని దరిద్రులు. వీరు నిస్సందేహంగా ద్రావిడచేటులకు సంబంధీకులైవుండాలి.

" చేరుల యొక్క చాలా ఆచారవ్యవహారాలు విచిత్రంగా వుంటాయి. వాటిలో ఒక ఆచారాన్ని బట్టి చూస్తే చేరులకు వైశాలి లిచ్ఛవులలో, నేపాల్‌కు చెందిన నేవార్లతో సంబంధం వున్నట్లు కన్పిస్తుంది. ఆ ఆచారం రాజును ఎన్నుకొనే పద్ధతి, సకల లాంఛ

నాలతో అతనికి రాజలిచ్ఛవీయుల, నేవార్ల ఆచారాలు మేళవి స్తాయి. అందరూ సర్పదేవతను ఆరాధిస్తారు నేపాల్‌లో కర్కోటక నాగ ఎలాగో కాశ్మీర్‌లో నీల నాగుడంతే. లిచ్ఛవులరాజధాని వైశాలిలో నాగదేవత వారి ఇష్టదైవం. లిచ్ఛవుల, నేవార్ల వివాహ సంబంధ బాంధవ్యాలు తమిళ ప్రజల వివాహ సంబంధాలతో సరిపోతాయి. వీటన్నింటికి మూలం ఒక్కటే అని చూపేటంతగా సరిపోతాయి.'' ఈ వాదాన్ని బాలకృష్ణ నాయర్ అనే ఆధునిక ద్రావిడ రచయిత సమర్థించారు ఇంతేగాక కల్నల్ టోడ్ చంబల్ నది సమీపంలోని కాన్స్వా అనేచోట ఒక శాసనాన్ని కనిగొన్నాడు ఆ శాసనంలో 'సర్ప" వంశానికి సంబంధించిన సమీంద్రుడనే రాజు 'తఖ్య'ను పాలించినట్లుగా చెప్పబడింది. పంజాబులో వున్న ఈ 'తఖ్య'ను చైనాయాత్రికుడు హుయాన్‌త్సాంగ్ సందర్శించాడు. ఈ ప్రాంతంలో నాగప్రజలు జీవించారు. అట్లాగే హిమాలయ ప్రాంతాలలో సట్లజ్, బియాస్ నదీలోయల మధ్య సరాజ్ అనే ప్రదేశం వుంది. ఇక్కడకూడ నాగులు చిన్న చిన్న దేవుళ్ళను ప్రధాన దేవతలుగా భావించి పూజిస్తారు. అప్పర్ చీనాబ్ లోయలో అదేపేరుగల మరొప్రదేశాన్ని కూడ నాగ దేవతల్ని ఆక్రమించి వున్నారు.

ఈ చరిత్ర కారుల మొత్తం వాదాలను బట్టి నాగులకు

1 కల్నల్ టోడ్ కనుగొన్న శాసనంలో వర్ణించబటిన 'సర్ప" వంశానికి సరాజ్ అనే పేర్లు సరిపోతున్నాయి.

2. గంగానదీ లోయలో నివసించిన చేరులకు పర్యాయ పదమైన సియోరీతో సియోరాజ్ జతపడుతుంది.

---

అస్పృశ్యులెవరు - డా॥ బి. ఆర్. అంబేడ్కర్ పేజీ-66

3. ప్రాచీన తమిళంలో చేరులు లేక నాగులకు సమానార్థక మైన 'సరాజ్" పోలివున్నట్లు తెలుస్తుంది:

వీటన్నింటిని పరిశీలించి అంబేడ్కర్ సర్పాలు లేక తక్ష్యాలుగా పిలువబడుతున్న సట్లేజ్ లోయలోని సరాజ్ ప్రజలు, గంగా నదీ లోయల్లోని చేరులు లేక సియోరీలు, దక్షిణా పథంలోని చేర సేర, కేరళ ప్రజలంతా ఒకే నాగారాధక ప్రజలలో విభిన్న శాఖలు మాత్రమే నని తేల్చారు.

ఇంకా ఆయన తన సుదీర్ఘ పరిశీలనలో "హిమాలయ ప్రాంతాలలో మాట్లాడే కొన్ని మాండవీకాలలో 'కీర' లేక 'కీరి' అంటే సర్పమని అర్థం దాన్ని బట్టే ఆ తెగవారికి కిరాత నామం వచ్చింది. "కీర" శబ్దం నాగ శబ్దానికి తుల్యార్థక శబ్దం కాబట్టి సర్పాన్ని ఆరాధించే 'కీర' తెగ ప్రజలకు ద్రవిడ దేశంలోని కీరులు, చేరులతో దక్షిణాది కేరళ ప్రజలతో చాలా సన్నిహిత సంబంధం వుండేదని చెప్పటలో సందేహం అవసరం లేదు" అని తేల్చారు.

అంబేడ్కర్ తన సామాజిక మానవశాస్త్ర పరిశీలనల ఆధారంగా "దక్షిణాపథ ద్రావిడులు, ఉత్తర పథంలోని నాగులు లేక అసురులు వచ్చిన మూలంనుంచే రూఢిగా వచ్చినట్లు చెప్ప వచ్చు ఈ విధంగా నాగులు ద్రావిడులు వేరు కాదని ఒకే జాతి ప్రజలని తేటతెల్లమవుతుందని నిగ్గుతేల్చారు. ఈ సిద్ధాంతాన్ని ఆ తరువాత చరిత్రకారులు ధృవపరిచారు కూడ.

ఈ పరిశీలననుబట్టి ద్రావిడులు, నాగులు ఒక్కటే నని రూఢీ అయ్యింది.

నాగుల, ద్రావిడుల భాషా సంబంధాలను పరిశీలించి నట్లయితే భారతదేశంలో కాశ్మీరునుండి కన్యాకుమారి వరకు పరివ్యాప్తమైన నాగసంస్కృతి గురించి అవగత మవుతుంది. ఉత్తర ప్రాంతంలోవున్న పాండ్య, కేకయ, వాహ్లిక, సహ్య, నేపాళ, కుంతల సుదేష, భోట, గాంధార, హైవ, కనోజ్ఞ దేశాలు పైశాచి దేశాలని, ఈ దేశాలలో పైశాచి భాష మాట్లాడబడేదని లక్ష్మీధరుడు తన షహన చంద్రికలో పేర్కొన్నాడు, ప్రాకృత భాషలుగా పాణినీయం వీటిని పేర్కొంది. ఈ పైశాచిక భాషను సంస్కృత నాటకాలలో నీచపాత్రకు పయోగించారు. ఆర్యులకు ముందున్న ఉత్తరభారతంలోని ప్రాచీన భారతీయ తెగలు ఈ పైశాచిక భాషలు మాట్లాడాయి. ఉత్తర ద్రావిడ భాషలలో నొకటైన బ్రహూయికి దక్షిణ ద్రావిడ భాషలతోవున్న సంబంధాన్ని పరిశీలించి చూస్తే అటు ఉత్తరప్రాంతం నుండి యిటు దక్షిప్రాంతంవరకు ద్రావిడుల లేక నాగుల వ్యాప్తి మనకు ఆ రెండు జాతులు ఒకటేనని నిర్ధారణ చేస్తున్నాయి. ఈ విషయాన్ని విశ్లేషణాత్మకంగా వివరిస్తూ డా॥ అంబేద్కర్—

"తమిళం, దానికి దగ్గరగావున్న భాషలు, ప్రాచీన అసురభాషాప్రాతి పదిక మీదనే సృష్టిఅయ్యాయనే అభిప్రాయం ఆధారసహితమైంది. ఎలాగంటే సింధురాష్ట్ర సరిహద్దులో నివసించే 'బ్రాహుయి' అనే తెగప్రజలు మాట్లాడే భాష దక్షిణాత్య భాషలకు అత్యంత సన్నిహితంగా వున్నట్లు కనుగొనబడింది. ఈ సందర్భములో డా॥ కాడ్‌వెల్ యిలా అన్నారు" యీ బ్రాహుయి భాష ద్వారా ద్రవిడజాతి జాడ సింధు తీరం దాటి మధ్యాసియా దక్షిణ సరిహద్దుదాకా కన్గొన వీలయింది. నేసింతకు

ముందే చెప్పినట్లుగా, యీ ప్రాంతమే అసురుల లేక నాగుల స్వస్థలం ద్రావిడ రాజ్య సంస్థాపకులు ఈ జాతికే చెందిన వాళ్ళు"

దీనినిబట్టి అంబేద్కర్ నాగులు, ద్రావిడులు ఒకటేనని నిరూపించాడు. ఆధునిక చరిత్రకారుల్లో సుప్రసిద్ధురాలైన 'రోమిల్లా థాపర్' కూడ నాగుల ప్రాచీనతను ఇలా వివరించారు.

"The search for new settlments would also have brought them into conflict with microlithic and neolithic cultures already occupying these lands, such as the Bagor culture or the earliest phase of the Malwa culture. These would be food- gathering and herding groups or agriculturalists at a pre - metal age. Can these be identified, as has been suggested, with the Nagas, Pulindas etc; Which are mentioned in the literary sources? The archaeological remains of these would be difficult to locate as most of them would have been absorbed into the chalcolithic culture."

సామాజిక శాస్త్రంలో, చరిత్రలో ప్రసిద్ధులైన డా॥ అంబేద్కర్, రొమిల్లాథాపర్ ద్రావిడులు, నాగులు ప్రాచీన భారతీయులని ఇరువురు ఒకే జాతికి సంబంధించినవారని నిరూపించారు.

## నాగులు ద్రావిడుల వారసులే దళితులు

నాగులు, ద్రావిడులు ఒక్కరే అనే అంశము తేలింది. అయితే ద్రావిడ జాతులకు ముందే భారతదేశంలోవున్న ప్రాచీన

---

1. Ancient Indian Social History - Romila Thapar
page - 254

తెగలు ద్రావిడులలో నాగులలో కలసి పోయాయి. వాటికి వీటికి శత్రుస్థైర్యం వున్నట్లు ఎక్కడా రుజువు కాలేదు. అంతకు ముందున్న భారతీయ తెగలల్లో పెక్కు వీరిలో సమ్మిశ్రితం చెందాయి.

ముఖ్యంగా భారతీయ గ్రామీణ వ్యవస్థలో ఈనాడున్న వెనుకబడిన కులనామాలు, అస్పృశ్యకుల నామాలు పెక్కు సంస్కృతేతరమైనవే. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలు కాక శూద్రులలో ఆర్యీకరణ చెందిన కొన్ని భూస్వామ్య కులాలు తప్ప మిగిలిన కులనామాలన్ని సంస్కృతేతరమైనవే.

ఆంధ్ర దేశంలో దళితుల, గిరిజనుల, వెనుకబడిన కులాల పేర్లు మనం పరిశీలిస్తే స్పష్టంగా వీరు ఆర్యేతరులని మనకు రుజువవుతుంది.

## ఆంధ్రప్రదేశ్‌లో షెడ్యూలు కులములు, తెగలు, వెనుకబడిన తరగతులు

### షెడ్యూలు కులములు

1. రాష్ట్ర వ్యాప్తంగా

1. చలవాడి 2. చమర్, మోచి లేక మూచి 3. మాదిగ 4. మాల

2. హైదరాబాదు, మహబూబ్‌నగర్, అదిలాబాదు, నిజామాబాద్, మెదక్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం మరియు నల్గొండ జిల్లాలు మినహా మిగిలిన రాష్ట్రంలో–

1. ఆది ఆంధ్ర, 2. ఆది ద్రావిడ, 3. అరుంధతీయ 4. బంకి 5. బావురి, 6. దాచటి, 7. ఛండాల, 8. దండాసి, 9. డోమ్

డొంబార, పైడి లేక పానొ 10. గాసి, హడ్డి లేక రెల్లి చాచండి 11. గొడగాలి 12. గోదారి, 13. గోసంగి. 14. జగ్గలి, 15. జాంబువులు 16. మడసికురువు లేక మదారికురువ, 17. మాలదాసు, 18. మాదిగదాసు, మరియు మాస్తిన, 19. మాతంగి, 20. ముండల 21. పాకి లేక మోతి, 22. పాలబడ లేక పాంబండ్, 23. పమిడి 24. పంచమ లేక పరియాహ్, 25. రెల్లి, 26. సాంబన్, 27. సాప్రు 28. తోటి.

3. హైదరాబాదు, మహబూబ్‌నగర్, ఆదిలాబాద్, నిజామాబాద్. మెదక్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం మరియు నల్గొండ జిల్లాలలో —

1. అనాముక్, 2. అరె(మాల). 3. అశ్వమాల, 4. బేడ (బుడగ) జంగం, 5. బిండ్ల, 6. బేగర, 7. చాంబర్, 8. దక్కల్ (దక్కలవారు), 9. దోర్, 10. ఎల్లిమల్ వారు, 11. హోలెయ. 12. హోలెయ దాసరి, 13. కొలుపులవాండ్లు, 14. మహర్, 15. మాలదాసరి, 16. మాలహన్నాయ్, 17. మాలజంగం, 18. మాలమష్టి, 19. మాలసాల, 20. మాలసన్యాసి, 21. మాంగ్, 22. మాంగ్‌గరొడి, 23. మన్నె, 24. మష్తి, 25. మెహతార్, 26. మిత అయ్యల్‌వార్, 27. సామగర, 28. సింధోళ్ళు.

## షెడ్యూలు తెగలు

1. రాష్ట్ర వ్యాప్తింగా

1. చెంచు, 2. చెంచువారు, 3. కోయ, లేక గొడు, వాని తెగలు, రాజకోయ లేక రాష్ట్రకోయ లింగధారి కోయ(సాధారణ) కోతుకోయ, భీమ్‌కోయ మరియు రాజకోయ.

2. హైదరాబాదు, మహబూబ్‌నగర్, అదిలాబాద్, నిజామాబాద్, మెదక్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం మరియు నల్గొండ జిల్లాల మినహ మిగిలిన జిల్లాలలో —

1. బగత, 2. గడబాస్, 3. జతపాస్, 4. కమ్మర, 5. కట్టునాయకని, 6. కొండదొరలు, 7. కొండకాపులు, 8కొండరెడ్డిస్, 9. కోండ్‌లు (కోడి మరియు కొధు) దేశీయకోంధ్‌లు, డొంగ్రా కోధ్‌లు, కుట్టియ కోధ్‌లు తికిరి యకోధ్‌లు మరియు యెనిటి కోధ్‌లు 10. కొటియా బెంతొవొరియ. బార్తిక, ధూళియ, హొల్వా, పైకొ, పుటియ, పన్‌రొనా మరియు పిధొపైకొ, 11. కులియ, 12. మలిస్ 13. మన్నదొర, 14. ముఖదొర లేక నూకదొర, 15. పోర్జ (పరంగవర్జ) 16. రెడ్డిదొర, 17. రోనరీవ, 18. మన్నదొర, కుట్టుసవరాన్, 19. సుగాలీస్ (లంబాడీస్) 20. ఏనాది, 21. ఎరుకల.

3. హైదరాబాదు, మహబూబ్‌నగర్, అదిలాబాదు, నిజామాబాదు, మెదక్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం, నల్గొండ జిల్లాలో

1. అన్డ్, 2. భిల్, 3. గోండు (నాయక్ పోడ్ మరియు రాజ్‌గోండ్) 4. కొండరెడ్లు. 5. కోరమ్ (మన్నెవార్లు) 6. పర్జాన్ 7. తోటి.

4. ఎజెన్సీ ప్రాంతాలలో—

1. గౌడు (గౌడ్) 2. నాయక్ 3. వల్మికి.

## వెనుకబడిన తరగతులు

గ్రూపు—ఎ

ఎబొరిజనరల్ ట్రైబ్స్, విముక్తజాతులు నొమాడిక్ మరియు సెమి నొమాడిక్‌ట్రైబ్స్ 1. అగ్నికుల క్షత్రియ పల్లి

పెదబలిగ, బెస్త, జాలరి, గంగావారు గంగపుత్ర, గోండ్లు, వెంక కుల క్షత్రియ (వెన్న కాపు, వెన్న రెడ్డి, పల్లి కాపు, పల్లి రెడ్డి) నయ్యాల, పట్టాపు, 2. బాలసంతు బహురూపి 3. బండర 4. బుడ బుక్కల 5. రజక (చాకలి వన్నారి) 6. దాసరి (పూర్వము బిక్షకవృత్తి. నేర ప్రవృత్తిగలవారు) 7. దొమ్మర 8. గంగిరెద్దువారు 9. జలగం (బిక్షక వృత్తిగలవారు) 10. జోగి 11. కాటిపాపల 12. కొర్చ 13మేదరి లేక మహేంద్ర 14.మొండివారు మొండిబండ బండ 15. నాయి బ్రాహ్మణ (మంగలి) 16. నక్కల 17. పిచ్చి గుంట్ల 18. పాముల 19. పార్ధి (నిర్షికారి) 20. పాంబల 21.పెద్దమ్మ వాండ్లు, దేవరవాండ్లు, ఎల్లమ్మవాండ్లు, ముత్యాలమ్మవాండ్లు 22. వీరముష్టి (నట్టికోతల) 23. వాల్మీకి, బోయ (బాదర్ కిరాతక విషాది ఎల్లపి పెద్దబోయ) 24. గుడాల 25. కింజరబట్టు 26. కింతల కళింగ 27. కొంపార లేక రెడ్డిక 28. మొండిపట్ట 29.నొక్కర 30. పరికిముగ్గుల 31. యాట 32. చోపమాలి 33. కైకాది 34. జోషి నందవాల 35. ఒడ్డ (ఒడ్డిలు వడ్డి మరియు వడ్డోలు) 36. మందుల 37. మహాతర్ (ముస్లిం) 38. కూనపులి.

గ్రూపు - బి

1. అచ్చుకట్లవాళ్ళు 2. ఆర్యకక్షత్రియ, మూచి (తెలుగు మాట్లాడేవారు) చిత్తారి, గినియార్, చిత్రకార, నఖాస్ 3. దేవంగ 4. ఎడిగగౌడ (గమళ్ళ కలాలి) గౌండ్ల సెట్టిబలజ (విశాఖపట్నం తూర్పుపశ్చిమగోదావరులు కృష్ణాజిల్లాలలో) 5. దూదేకుల లద్దప్ పింజారి లేక నూర్బాష్ 6. గండ్ల తలికుల 7. జాండ్ర 8. కుమ్మర లేక కులాల 9. కరికల భక్తులు కైకలమ్ లేకై కోకల (సంగుతమ్ లేక సంగుంతేర్ 10. కరమభక్తులు 11. కురుబె లేక కురుమ

12. నాగవడ్డీలు 13. నీలికంఠి 14. పట్కార్ 'ఖత్రి' 15. పరిక 'పరి బలిజ పురంగిరి క్షత్రియు' 16. సప్పి లేక కుప్పి 17. పద్మసాలి (సాలి సాలివాన్ పట్టుసాలి సానపతులు తగడసాలి) 18. శ్రీసాయన్ (పగిడి) 19. స్వకులసాలి 20. తొగట తొగటి లేక తూగటూయర క్షత్రియ 21. విశ్వ బ్రాహ్మణ (అనుసూల లేక కంసాలి, కమ్మరి, కంచర వడ్ల లేక వడ్ర లేక వడ్రంగి మరియు శిల్పి)

గ్రూపు - సి

1. క్రిస్టియనులుగా మారిన షెడ్యూలు కులములవారు వారి పిల్లలు.

గ్రూపు - డి

1. అగరు 2. అరెకటి కటిక 3 అటగర 4. బట్రాజు 5. చింపోళ్ళ (మేర) 6. గవర 7. గడబ 8. హట్కల్ 9. కక్కన 10. జింగర్ 11. కంద్ర 12 కొష్టి 13. కాచి 14. కళావంతులు గణిక 15 కృష్ణబలిజ (దాసరి బుక్క) 16. కొప్పుల వెలమ మాతుర 17. మాలి 81. ముదిరాజ్ ముతరాసి, తెనుగోళ్ళు 20. మున్నూరు కాపు (తెలంగాణా) 21. నాగవాసమ్ (నాగవంశ) 22. పెల్లి 23. పొలినాటి వెలమ (శ్రీకాకుళం, విశాఖ జిల్లాలు) 24. పూసల 25. బస్సి 26. రంగరాజ్ లేక భవసార క్షత్రియ 27. సాధుచెట్టి 28. సాతాని (చట్టదశ్రి వైష్ణవ) 29. తమ్మాలి 30. తూరుపుకాపు లేకగాజుల కాపు (శ్రీకాకుళం, విశాఖపట్నం జిల్లాలు) 31. ఉప్పర లేక సంగర 32. వంజర (వంజారి) 33. యాదవ (గొల్ల.)

# ఆర్యులు - అనార్యులు

భారతదేశంలో ప్రాచీనంగా జీవిస్తున్న తెగల ప్రజలు ఆటవిక, అనాగరిక, సంస్కృతులనుండి గ్రామసమాజాలుగా ఒక ప్రక్కరూపొందుతున్న కాలం మరొకప్రక్క సింధూనగర సంస్కృతి వ్యవసాయ సంస్కృతిలో భాగంగా రూపొంది భారతదేశ సంస్కృతిలోని ఔన్నత్యం ఖండఖండాంతరాలు ప్రవహిస్తున్న కాలం. ఇప్పటి వరకు భారతదేశంలో అస్పృశ్యత ముద్రవేయబడిన ప్రజలులేరు. అయితే ఆ తరువాత కాలంలో 'అస్పృశ్యులుగా' ముద్ర వేయబడి దళితులుగా పిలువబడుతున్న ప్రజల పాత్ర ముందు యుగాల్లో ఏ విధంగా క్రియాశీలక పాత్ర వహించిందో చూశాం. ఇక ఆర్యుల గురించి, వారు నాశనం చేసిన సంస్కృతిని గూర్చి వారు భారతదేశంలో పరివ్యాప్తమైన, సామాజిక రూపాల గురించి మనం ఆలోచించాలి.

ఆర్యులంటే ఎవరు? వారు ఒక జాతి ప్రజలా, లేక ఒక భాషా సమూహమా అనే ప్రశ్నకు సమాధానంగా డి. డి. కోశాంబి ఈ విధంగా వివరించారు.

"The people who first used the Vedas as their savred text, who first spoke the Sanskrit language and worshipped a particular group of deities led by Indra called themselves Arya. The term persist throughout later Sanskrit and its derivative languages, ultimatvly to become just a

respectful salutation. In between, Arya passed through the meanings "Noble" "Well-born" "Free" Western scholars from the nincteenth entury onwards used the word Aryan to denote a considerable group of closely related lunguage Sanskrit Greek, Latin the Teutonu slave and Roman's types[1]

వేదాలను ప్రామాణిక గ్రంథాలుగా భావిస్తూ, సంస్కృత భాషల్లో మాట్లాడుతు, ఇంద్రుని వంటి దేవతలను పూజిస్తూ జీవించిన ఒక గుంపు ప్రజలు తాము ఆర్యులమని చెప్పుకున్నారు. సంస్కృత సాహిత్యంలో, దాన్నుంచి పుట్టిన ఇతర భాషల సాహిత్యాల్లో ఈ పదం పదే పదే దర్శనమిస్తుంది. కొంత కాలానికి ఈ పదానికి 'పెద్దమనిషి' 'ఉన్నత వంశ సంజాతుడు' బానిసకాని 'స్వేచ్ఛా జీవి' అనే అర్థాలు ఏర్పడ్డాయి. పందొమ్మిదవ శతాబ్దం తరువాత పాశ్చాత్య పండితులు ఒక భాషా బృందానికి సంబంధించిన ఈ పదాన్ని ఉపయోగించారు. సంస్కృతం గ్రీక్, లాటిన్, ట్యుటానిక్, స్లామ్, రోమన్ భాషలు ఈ భాషా బృందం క్రిందికి వస్తాయి

ఆర్యశబ్దం జాతి పరంగా ఉపయోగించటం సరైంది కాదని కూడ చరిత్రకారుల అభిప్రాయం ప్రాచీన కాలంలో ఆర్యులనే ప్రజలు ఒక భాష మాట్లాడే గుంపుగా మాత్రమే పిలువబడ్డారు. జాతికి మానవ శాస్త్రజ్ఞులు తీసుకున్న గీటురాళ్ళపైన ఆధారపడి ఎముకల కొలతలు జుట్టురంగు కళ్ళరంగు శరీర వర్ణన మొదలైన వాటి ఆధారంగా ఆర్యులజాతి మనం పరిశీలిస్తే ఆపద్ధతిలో ఇప్పుడు భారతదేశంలో అటువంటి జాతి ఏదీ

1 An Introduction to the study ot Indian HIstory - page-80 (Damodar- Dharmanand Kosambi)

కనిపించుటలేదు అయితే భాషా పరమైన జాతిగా మాత్రం కనిపిస్తున్నారు.

భాషాసంస్కృతిని బట్టి పరిశీలించినపుడు ఆర్యులు భారతీయులుకారని స్పష్టం అవుతుంది. "The Indo- Aryan speakers spoke Sanskrit where as the indigenous peoples probaly spoke Dravidian and Munba". [1] ఇంతేగాక పురాతత్వ శాస్త్రజ్ఞుల పరిశీలననుబట్టి ఆర్యులకు ఒక ప్రత్యేక సంస్కృతిలేదు. ఆర్యులవి అనదగిన కుండలు పనిముట్లు ఆయుధాలు వంటివికూడ ఏమీ దొరకలేదు. ఆర్యులు ఆయా ప్రాంతాల ప్రజల సంస్కృతిని సొంతం చేసుకొని తమవిగా చాటుకున్నారు.

"However, the Aryans do not form a single "Culture" in the archaeologist's sense of the word, so that a totally new procedure from that of the preceding chapter in necessary to deal with them. There is no characteristically Aryan pottery, tool, weapon, as such. The Aryans regularly adopted whatever suited them, from the people with whom they came into contact."[2]

భారతదేశానికి వలస వచ్చిన ఈ ఆర్యులు క్రీ॥ పూ 2వ సహస్రాబ్ది మొదట్లో ఇక్కడకు వచ్చారు. సింధూలోయ నాగరికతను నాశనం చేసింది వీరే. ఈ దండయాత్రను వర్ణిస్తూ సుజాయుదాస్ గుప్తా ఇలా అన్నారు

1 Ancient Indian Social History (page - 125)
Romila Thapar

2. An Introduction to the study of Indian History (page - 81)
Damodar Dharmanand Kosambi

"The Aryans who raided India from time to time were surely tribal hordes, primitive, extro-punitive. unfettered by the norms of civilisation, turbulent and aggressive, violence and destruction must have been their normal feature, as they named one of their principal chieftains 'Purandara' (worshipped as a deity, latter-God of war) that is destroyer of towns"[1]

ఆర్యులు ఉపయోగించిన పురంధర మొదలగు శబ్దాలు వారికి నగర సంస్కృతి మీద ఉన్న, ద్వేషాన్ని నాశనం చేసే పద్ధతిని తెలుపుతున్నాయి. భాషాశాస్త్రాన్ని అనుసరించి వేదార్యులు, ఇరానియన్లు, రోమన్లు, గ్రీకులు, స్లావులు, ట్యుటానియన్లు వీరందరి మూలం ఒక్కటేనని భావించటానికి ఆస్కారం ఉంది. మొత్తం ఆర్యుల వ్యవస్థను గురించి పరిశీలించిన చరిత్రకారులు ఆర్యులు కంచుయుగానికి చెందిన పితృస్వామిక తెగలని వీరు మధ్య ఆసియా నుంచి బహుశ ఈశాన్య ఇరాన్ ప్రాంతాల నుంచి కాస్పియన్ సముద్రానికి చుట్టూవున్న ప్రాంతాలనుంచి ప్రస్తుతం సోవియట్ రష్యాలోని ఆసియా రిపబ్లిక్కులు వచ్చి వుంటారు.

ఆర్యులు భారతదేశానికి, పశ్చిమాసియాలో పలు ప్రాంతాలకు, ఐరోపాకు వలస వెళ్ళారు. భారతదేశానికి వలస వచ్చిన ఆర్యుల్ని భారతీయ ఆర్యులు అంటున్నాం. భారతదేశానికి మొదటి రాజకీయ దండుగావచ్చిన ఆర్యులకు మొదటి నుండి భారతీయ సంస్కృతిని శిధిలం చేసే ప్రవృత్తి వుంది. ఈ విషయాన్ని నొక్కి చెప్పడానికి డి. డి. కోశాంబి ఎవరైతే సింధూనాగరికతను నాశనం చేశారో ఆ ఆర్యులు క్రీ. పూ 2వ సహస్రాబ్ది ప్రారం

1. Hindu Ethos And The Challenge of Change (page-71)
Subhayu Dasgupta

భంలో వచ్చారని తెలిపారు. "The Aryans who destroyed the Indus cities made their first oppearance about the leginning of the second millennium B.C." ఆర్యులరాకను గురించి ప్రసిద్ధ పరిశోధకుడు రాహుల్ సాంకృత్యాయన్ సమకూర్చిన ఋగ్వేదార్యులనే గ్రంథంలో క్రీ. పూ. 1500 ప్రాంతంలో ఆర్యులు ఇక్కడకు వచ్చారని వివరిస్తూ ఆర్యులు భారతదేశానికి బయట నుండి వచ్చారు. అని అంగీకరించకపోయిన యెడల ఆర్యభాషా పరివారానికి చెందిన భాషల వారు యిక్కడ నుండి బయటకు వెళ్ళారని ఒప్పుకొనక తప్పదు. దీని వలన యింకా అనేక చిక్కులు వస్తాయి. వాటికి సమాధానం చెప్పటం కష్టమవుతుంది. ఆర్యభాష భారత ఐరోపా భాషలు వానికి సంబంధించిన యితర సామగ్రి యందు శ్రద్ధ లేకుండుటయే పై వాదనకు ముఖ్యమైన కారణంగా తోస్తుంది. ఇందు చేత మనశాస్త్రవేత్తలు కలియుగాన్ని, మహా భారత కాలాన్ని నమ్మిన మన చరిత్రను వేల సంవత్సరాలు వెనుకకు తీసుకొని పోవుటకు ప్రయత్నిస్తున్నారు. ఆసియా మైనరులో హిడ్డెయిటులు, గ్రీకులో యవనులు, ఈరానులో ఈరానీయులు ప్రవేశించిన కాలాన్ని పరిశీలిస్తే ఆర్యులు భారత దేశంలో ప్రవేశించినది. క్రీ. పూ. 1500 కంటే పూర్వం ఋగ్వేద ఋషులని అనుకొంటే వారి కాలం పైన చెప్పిన కాలానికి 300ఏండ్లు తర్వాత అవుతుంది. [1]

ఆర్యులు క్రీ॥పూ 2000 సంవత్సరాలు 1500 సంవత్సరాల మధ్యలోఅనగా 1750 ప్రాంతములో భారతదేశానికి వచ్చారు వారు సింధూనాగరికతను నాశనంచేశారు సింధూనాగరికతకు ప్రతినిధులైన ద్రావిడులు వారిలో అంతర్భాగంగా వున్న దళితులు

1. ఋగ్వేద ఆర్యులు (పేజి - 29) రాహుల్ సాంకృత్యాయన్

వారిని ఎదిరించినిలిచారు. ఇదే దళితుల ఆవిర్భావానికి కీలకమైన అంశము దీనికికావలసినన్ని ఉపపత్తులు ఆర్యులవాఙ్మయమైన ఋగ్వేదాల్లో మనకు లభిస్తూ వున్నాయి. భారతదేశంలోని ప్రజలు వ్యవసాయ సంస్కృతిలోకి ప్రవహించిన తరువాత ఆర్యులు భారతదేశానికి వచ్చారు. ఆర్యులు ప్రధానంగా గోపాలకులు అనేది వారికి ఉపయుక్తమవుతున్న విశేషణాలను బట్టి మనకు గోచరమవుతుంది "గోపాలకులు (గోవులను పరిపాలించేవారు), గవేషణ (గోవులను వెతకడం), గోపతి (గోవుల కధిపతి), గోమేధం (గోవులతోచేయు యజ్ఞం) గోఘ్నుడు (అతిధిగావచ్చి గోవులను చంపించువాడు), గోత్రం (గోశాల) అని వారిని వెన్నాడుతూ వచ్చిన ఈ విశేషణాలే వారి వృత్తిని ప్రకటిస్తున్నాయి"[1] ఇంద్రుడు వీరిప్రధాన దేవత. భరత భూమిలోని తమ శత్రువర్గాలను జయించే శక్తిని ఇమ్మని వారు ఇంద్రుని కొనియాడారు, వీరు ఇంద్రుని కొనియాడిన విధమును ఋగ్వేదంలో పరిశీలిస్తే వీరి శత్రు వర్గం ఎవరనేది మనకు అవగతమవుతుంది.

సరూపకృత్ను మూతయే సదుఘామివ గోమహే
జుహూమ సిద్యవిద్యవి॥

దం॥ మంచిపాలిచ్చుగోవును పాలుపిదుకుటకు (పాలుదీయువాడు) పిలుచునట్లు మంచి రూపముగల కర్మలను జేయునట్టి యింద్రుని మా రక్షకొరకు మేము ప్రతి దినము బిలుచుచున్నాము.

ప్రధమాష్టకం ఆనువాకం—2
ప్రధమాధ్యయనం సూక్తం —4 ఋక్కు-31

ఉపవస్స్వనాగహి సోమస్య సోమపాఃపిబ గోదా ఇదేవతోమిదః॥

దం॥ సోమపానము చేయు ఓయింద్రా! మాయజ్ఞముల వద్దకు రమ్ము సోమమును త్రావుము, నీ సంతోషము (మాకు) తప్పక గోవుల నిచ్చును.

ప్రథమాష్టకం అనువాకం - 2
ప్రథమాధ్యయనం సూక్తం - 4 ఋక్కు-32

ఉతనస్సుభగా అరిర్వోచేయుర్దస్మ కృష్టయః స్యామేదిం ద్రస్యశర్మణి॥

దం॥ శత్రువులనణంచునట్టి యోయింద్రా! శత్రువులుకూడామమ్ము లను (నీదయవల్ల) చక్కని ధనవంతులుగాఁ బలుకుదురుగాక. మామిత్రు (లిక చెప్పనేల?) ఇంద్రుండిచ్చిన శుభసంపదతోనే మేముండుముగాక.

ప్రథమాష్టం అనువాకం_2
ప్రథమాధ్యయం సూక్తం -4 ఋక్కు-36

ఆస్యపీత్వా శతక్రతో ఘనోవృత్రాగానుభవః ॥ప్రాణోవా జేషు వాజినమ్॥

దం॥ ఇంద్రా! ఈ సోమములోని భాగము త్రాగి వృత్రులను (అసురులను) జంపు వాండవుకమ్ము యుద్ధము చేయు చున్న నీ భక్తుని రణరంగమున రక్షింపుము

ప్రథమాష్టం అనువాకం—2
ప్రథమాద్యయనం సూక్తం —4 ఋక్కు—33

తంత్వావా జేషువాజినం వాజయామశ్మతక్రతో ।ధనానామింద్ర
పాతయే॥

దం ఓశత్రక్రయా ! (బహుకర్మలుచేయు నింద్రా !) ధన
ముల ప్రాప్తికొఱకు యుద్ధములలో బలవంతుండనగు
నిన్ను హవిర్భాగములాహారముగాఁగొనునట్లు చేయు
చున్నాము (హవిస్సులనిచ్చుచున్నామని )
ప్రథమాష్టం అనువాకం-2
ప్రథమాధ్యయనం సూక్తం -4 ఋక్కు-29

మోరాయో శివ నిర్మహసేత్సుపారస్సుస్వతస్పఖా॥తస్మా ఇంద్రా
యగాయత॥

ఏయింద్రుండు ధనమునకు రక్షకుడుఁగు, గుణాధికుఁడును
సత్కర్మలను బూర్తి చేయువాఁడును, యజమానునందు స్నేహ
భావముగలవాఁడును, ( అయియున్నాఁడో ) యింద్రుని
స్తుతింపుడు. [1]

ప్రథమాష్టం అనువాకం - 2
ప్రథమాధ్యయనం సూక్తం - 4 ఋక్కు-40

31వ ఋక్కును బట్టి ఆర్యులు గోపాలకులని, ఆ ఆలమంద
లను రక్షించు నిమిత్తము ఇంద్రుని వారు కొనియాడుతున్నట్లు
అర్థమవుతున్నది. 32వ ఋక్కును బట్టి ఆర్యులు సోమపానము
చేయుదురని, యజ్ఞము చేయుదురని, గోసంపద పెరుగునిమిత్తం

1ఋగ్వేదము (పేజి - 2, 5, 6, 7,)
శ్రీ బంకుపల్లి మల్లయ్యశాస్త్రిగారి అనువాదం

ఈ సోమపానమునకు ఇంద్రుని ఆహ్వానిస్తున్నారని తెలియు చున్నది.

36వ ఋక్కును బట్టి, శత్రువులనణచునట్టి ఓ ఇంద్రా అనిసంబోధిస్తున్న ఆర్యుల వేదాలు ప్రధానంగా తమశత్రు వర్గమైన ఆది భారతీయులను జయించే శక్తి నిమ్మని తమ దేవతల్ని కొనియాడిన కవితలే అనేది అర్థమవుతూవుంది. 43వ ఋక్కును బట్టి, ఈ సోమమును త్రాగి వృత్రులను జంపుమను చున్నారు. వృత్రులంటే వ్యవసాయ భూములకునీరు పారించు వారు. వారిని జయించడమే ఆర్యులధ్యేయం. ఆ నాటికీ, ఈ నా టి కీ, వ్య వ సా య భూములకు నీరుపారించు వా రు దళితులే. ఇంద్రునికి 'అప్సు-జిత్' అనే బిరుదువుండేది. అంటే నీటివనరులను ఆక్రమించే వాడని అర్థము. ఋగ్వేదం - 6. 13. 2, 1, 100, 11, 6, 44. 19, &C ) అంటే స్థానిక జాతుల మీద యుద్ధం చేయడానికి ఆర్యులు ఇంద్రుణ్ణి నాయకుడుగా భావించే ఆతణ్ణి ఆరాదించారు. అందుకే 40వ ఋక్కులో తమఆస్తులు రక్షించేవాడిగా అతణ్ణి ఆరాదించారు. ఈఋక్కులను బట్టి ఆర్యులు భారత దేశానికి వచ్చే నాటికి వ్యవసాయ నాగరికతకు వారసులుగావున్న ఆది భారతీయ తెగలను వీరు శత్రువులుగా ప్రకటించి వారిని జయించడానికి, తమదేవతలైన అగ్ని, వాయు, ఇంద్రాదులను తమకుశక్తిని ఇమ్మని నుతించారు. ఆకీర్తనలే ఋగ్వేదం లో ప్రధానపాత్రను వహిస్తున్నాయి. కొన్ని సందర్భాల్లో వారు శత్రువులుగా భావించుచున్న ఆది భారతీయులకు భయపడి వారినుండి మమ్ములను రక్షింపమని అభ్యర్థించటం కూడా జరిగింది.

॥మానోమర్తా అభీద్రుహంతనూ నామింద్రగిర్వణః ! ఈశావోయ
వమావధమ్॥

దం॥ స్తుతులకు సంతసిల్లువోయింద్రా! శత్రువులు మా శరీరములకు ద్రోహము చేయకుందురుగాక. ఓ సమర్థుండా! (వారు మాకుంజేయు) వధను దొలగించుము.

ప్రథమాష్టం అనువాకం - 2 ఋక్కు - 50
ప్రథమాధ్యయనం సూక్తం - 5

ఇక్కడ శత్రువులు చేసే 'వధ'ను తొలించమని ఇంద్రుణ్ణి వేడుకోవడం వలన శత్రువులుగా చెప్పబడుతున్న దస్యులు శక్తివంతులని అర్థమవుతుంది. ఆర్యులు తమ ఆలమందలను రక్షించటమే గాక, ఇతరుల ఆలమందలను దొంగిలించడానికి కూడా ఇంద్రస్తుతి చేశారు.

॥వీళుచిదారు జత్నుభిర్గుహాచిదింద్ర వహ్నిభి : అవింద
ఉస్రియా అను॥

దం॥ ఓ యింద్రా [ధృఢమగు మగణు స్థానమును గూడఁ బగులగొట్టునట్టియు [ఒక చోటనుండి యింకొకచోటికి] మోసికొని పోవునటియు నగువాయువులతోఁ గూడుకొని నీవు గుహలో దాఁచఁబడిన గోవులను సంపాదించితివి. [పణులవారు దేవతల యావులను గుహలో దాఁచినారట! ఇంద్రుండు మరమత్తుల సాయముతో పణుల జయించి గోవులందెచ్చెనట! కథ.]

ప్రథమాష్టం అనువాకం -4 ఋక్కు -55
ప్రథమాధ్యయనం సూక్తం -6

ఈ శక్తివంతమైన ఆర్యుల శత్రువులు దస్యులుగా చెప్ప బడుతున్న ఈనాటి అస్పృశ్య జాతులేనని జాన్ మార్షల్ అభిప్రాయపడ్డారు. అంతేగాక ఈనాటి చరిత్రకారులు అలా ఊహించడం కూడా కష్టమని ఆయన విశ్లేషించారు. ఆయన పరిశోధనాత్మకంగా వ్రాసిన "మొహంజదారో అండ్ ఇండస్ సివిలైజేషన్" అనే గ్రంధానికి వ్రాసిన పీఠికలో ఈ విషయాన్ని ఇలా వర్ణించారు.

Hitherto it has commonly been supposed that the pre-Aryan peoples of India were on an altogether lower plane of civilization than their Aryan conquerors; that to the latter they were much what the helots were to the Spartans, or slaves to their Byzantine overlords- a race so servile and degraded, that they were commonly known as Dasas or slaves. The picture of them gleaned from the hymns of Rigveda was that of black- skinned, flat – nosed barbarians, as different from the fair Aryans in physical aspect as they were in speech and religion, though at the same time it was evident that they must have been rich in cattle, good fighters. and possessed of many forts in which they defended themselves against the invaders. These "Forts" however, were explained away by vedic scholar as being no more than occasional places of refuge .Simple earth works, that is to say, surrounded, may be by palisades or rough stone walls,for seeing that the Aryans themselves were still in the village state and that their society was in other respects correspondingly primitive, it was deemed impossible that the older races of India- the contemptible, outcast Dasas could already have been living in

well built cities or fortresses or in other respects have attained a higher state of culture Mentally Physically socially and religiously their inferiority to their conquerors was taken for granted and little or no credit was given them for the achievements of Indian civilization. Never for a moment it was supposed that five thousand years ago before over the Aryans were heard of, the Punjab and Sind, if not other parts of India as well, were enjoying an advanced and singularly uniform civilization of their own closely akin but in some respets even superior to that of contemporary Mesopotamia and Egypt."[1]

ఆర్యులకు ముందున్న భారతీయులు వారి ఆర్య విజేతల కంటే నాగరికతలో తక్కువస్థాయి వారని ఇంతకు పూర్వం భావింపబడినది. వారు ఆరుల్యకు, "స్పార్టన్లకు హెలాట్ల(బానిసల) వలె, ఉన్నారు. ఒక జాతిగా వారెంత భృత్యులై, క్రిందిస్థాయికి నెట్టబడినారనగా, వారుసాధారణంగా దాసులు లేక బానిసలుగానే తెలుసు. ఋగ్వేద శ్లోకాలనుండి వచ్చువారి ఆకారమెట్టిదన, వారు నల్లని చర్మము, దిబ్బముక్కు (చట్టిముక్కు) గల ఆటవికులు. భాష, మతములోవలె, స్ఫురద్రూపులైన ఆర్యుల కంటెవారు భిన్నమైనవారు అయితే వారు పశుసంపదగలవారు, మంచి యుద్ధ వీరులు, చాల కోటలుగలిగి, వాటినుండి దాడిచేయువారి బారి నుండి తమను రక్షించుకొనెడి వారనునది సుస్పష్టము. వేద పండితులు ఈ "కోటల"ను అక్కడక్కడగల శరణాలయాలుగా, మట్టికట్టడాలుగా, అనగా చుట్టూకొయ్యదడులు, లేకఎగుడు

---

1. History and Philosophy of Lingayat Religion.
M. R. Sakhare M.A.T.D (contab)

ఉగ్గుడురాతి గోడలు గలదిగా వివరిస్తారు. ఎందుకంటే ఆర్యులు ఇంకా గ్రామవాసులే. పోలికగా వారి సమాజము ఇతర విధాల ప్రాచీన మైనదని గమనించితే, అసహ్యమైన, అంటరాని దాసులు ఇంతకు పూర్వమే మంచి నగరాలలో లేక కోటలలో ఉంటు న్నారని, లేక ఇతరవిధాల ఉన్నతమైన సంస్కృతినిపొందారని భావించుట ఆర్యులకు అసాధ్యము. మానసికంగా, దైహికంగా, సాంఘికంగా,మతపరంగా విజేతలైన ఆర్యులకంటే వారితక్కువ తనం ఊహింపబడినది. భారతీయ నాగరికత విజయాలలో వారికి ఏమీ పేరుఇవ్వలేదు. ఆర్యుల రాకగురించి వినబడకముందే పంజాబ్, సింధ్ వాసులు, మిగిలిన ప్రాంతాలలో కానవ్చుటికి, వృద్ధిచెందిన, విలక్షణంగా ఒకేవిధమైన, సమకాలీన ఈజిప్టు, మెసపొటేమియా నాపరికతకు దగ్గరగా పోలిన, కొన్ని విషయా లలో మిన్నయైన నాగరికతను అనుభవిస్తున్నారన్నది అయిదు వేల ఏళ్ళకు పూర్వం క్షణకాలం గూడా ఊహించబడలేదు.

ఋగ్వేదంలో ఆర్యఋషులు తమ శత్రువులను నిందించ డానికే (ఋక్కులలో) ఎక్కువ ప్రయత్నించారు. వారంత ప్రాధాన్యతనిచ్చారంటే, ఆశత్రువర్గం ఎంతో శక్తివంతమయిం దని మనకు అర్థమవుతుంది. ఆర్యఋషైన మధుఛ్ఛందుడు ఇం ద్రుని స్తుతిలో శత్రువర్గాన్ని జయించడానికి ఎలా అభ్యర్థిస్తు న్నాడో చూడండి.

ఇంద్రత్వోతాస ఆవయం వజ్రంఘనాదదీమహి ॥జయేమ.
సంయుధిస్పృధః॥

దం॥ ఓ ఇంద్రా! నీచే రక్షితులమగు మేము ఘనమైన వజ్రమును దీసికొనుచున్నాము. (ఆ వజ్రముతో) యుద్ధ

మంలందు శత్రువులను జయింతుము.

వయంశూరేభి ర స్తృభి రింద్రత్వయా యుజావయమ్
॥సాసహ్యామ పృతన్యతః॥

దం॥ శూరులై యాయుధహస్తులయిన భటులతోను నీతోను గూడినవారుమై ఓ యింద్రా! సేనలలోఁగూడిన శత్రువులను మేమోడింతుము.

మహా ఇంద్రః పరశ్చను మహిత్వ మస్తువజ్రిణే ।ద్యౌర్న ప్రథివాశవః

దం॥ ఇంద్రుఁడు గొప్ప శరీరము గొప్ప గుణములు కలవాడు. అయినను వజ్రము ధరించిన యింద్రునకు అవి (శరీరము, గుణము) అధికములగుఁగాక, ద్యులోకమెంత విస్తారమో అంతగా బలము విస్తరించుఁగాక

ఏవాహ్యస్య సూనృతా విరప్శీ గోమతీ మహీ
॥పక్వా శాఖా న దాశుషే।

దం॥ యుద్ధములలో హెచ్చరించునదియు, గోవులనిచ్చునదియు సత్యప్రియమైనదియునగు నా యింద్రుని వాక్కు యజమానునకుఁబండ్లతో నిండిన కొమ్మవంటిదగుఁగదా

సింధూ నాగరికతకు నాయకత్వం వహిస్తున్న జాతులు, ఆర్యులకు ఎదురు నిలిచి పోరాడారు అనుటలో ఎలాంటి సందేహం లేదు. భారతదేశానికి ప్రాతినిధ్యం వహిస్తున్న వారు వ్యవసాయ సంస్కృతికి ప్రతినిధులుకాగా, వారికి వ్యతిరేకంగా నిలబడిన ఆర్యులు పశుగణాలకు నాయకులు. ఆర్యులది పితృస్వామిక వ్యవస్థ, భారతీయగణాలది మాతృస్వామ్య వ్యవస్థ. వారికి వీరికి జీవన విధానాల్లో వైరుధ్యం వుంది. అందుకే ఆర్యగణాలు భారతీయ వారసుల్ని జయించడానికి తహ తహలాడారు. ఆనాడు భారతీయుల తరుపున నిలబడి పోరాడిన వారినే ఆర్యులు రాను రాను శత్రువులుగా అస్పృశ్యులుగా కూడా ప్రకటించి వారిమీద ద్వేషానలాన్ని కుమ్మరించారు. ఈ విషయాన్ని వివరిస్తూ నార్లతన సీతజ్యోస్యం! పీఠికలో "ఆర్యులు వలసరావడానికి పూర్వం ఇక్కడ స్థిరపడిన వారిలో, నీగ్రోలున్నారు. నిషాదులున్నారు, కిరాతులున్నారు, ద్రావిడులున్నారు. వీరందరిని కలగా పులగం చేసి దాసులనీ, దస్యులనీ వారికి నామకరణంచేశారు. దాసుడు అనే పదానికి క్రమంగా బానిస శూద్రుడు అనే అర్థాలేర్పడ్డాయి. దస్యుడు అనే పదానికి శత్రువు చోరుడు అనే అర్థాలు ఏర్పడ్డాయి" 1 అని వివరించారు. నిజానికి దాస దస్య శబ్దాలు అస్పృశ్యులకే వారు వాడారు.

ఆర్యులు రోమనులవలె పితృస్వామిక వ్యవస్థకు సంబంధించిన వారని రాబర్ట్ బ్రిఫాల్టు తన పరిశోధనాత్మక గ్రంథం ది మథర్స్‌లో నిర్ధారించారు.

The connection of the Aryan race in India with the peoples of Europe is in all probability not so direct and so close as by the emphasis which is laid in their tradition on partiarchal principles, the attitude of the Romans and the ideas which have been in a large measure derived from them as regards the constitution of the family, The Subordinate and effaced position of women is indeed far more pronounced among the Hindus than it ever was in Patriarchal Rome.2

పితృస్వామ్యం రోముదేశంలోకంటే హిందువులలోనే స్త్రీల అధోగతికి కారణమైనదన్న వాస్తవం మిక్కిలి ప్రస్ఫుటము.

ఆర్యులు పితృస్వామిక సంస్కృతికి వారసులు వారినాయకులైన దివోదాసు, పురుకుత్సుడు ఏ విధంగా దస్యుల మీద యుద్ధం ప్రకటించిందీ, భారతీయ నగరాలను ఏ విధంగా నాశనం చేసింది. భారతదేశంలో వారికి ఎదురునిలిచిన వారెవరు? అనే అంశాలమీద పరిశీలన చేసిన ఆర్.పి.చందా ఈ విధంగా వివరిస్తున్నారు.

1. సీత జ్యోశ్యం – పేజీ 70 నార్ల వెంకటేశ్వరరావు

2. THE MOTHERS. (A study of the origins of sentiments and institutions) by Robert Briffault Page - 345

Many of the stanzas of the Rgveda contain references to pura and pur both of which terms mean 'nagara' (town) in classical sanskrit. In one stanza (7, 15, 4) an extensive (satabhuji) pur made of copper or iron (ayas) is reffered to. In another stanza (1,58,8) prayer is offered to Agni to protect the worshipper with purs of aryas. In such passages aryas is evidently used in a metaphorical sense to denote strength. Susna, a demon, is said to have a moveable (Carisnva) Pura (8, 1, 28). In the Rgveda pura is much oftener connected with the enemies of the Aryas than with the Arya Rsis and warriors, Two of the famous Rgvedic kings, Divodasa, the chief of the Bharatas, and purukutsa, the chief of the purus, are found engaged in war with hostile owners of puras. Divodasa was the son of vadhryasva and grandfather of the more famous sudas who defeated a confecleracy of ten tribes including the yadus, Turvasas and purus on the western bank of te parasni (Ravi). It is said (4, 30, 20) that Indra overthrew a hundred puras made of stone (asmanmaji) for his worshipper Divodasa. The puras the Indra overthrew for Divodasa evidently belonged to sambara who is called a Dasa (non-Aryademon) of the mountain (6,26,5). In one stanza (9,60,2) among the enemies of Divodasa are mentioned the yadu (the chief of the yadus) and Turvasa (the chief of the Turvasas) with sambara. The greatest favour that Indra performed on behalf of purukutsa, the chief of the purus, is thus described in a stanza (6, 20, 10 ) "May we, O indra, gain new (wealth) through your favour the purus worship thee with this hymn and sacrifices. You destroyed the seven autumnal (saradi) puras with thunder weapon, slew Dasas and gave wealth to purakutsa." The epithet saradi, usually translated as ' autumnal' is explained by sayana in different ways.[1]

ఋగ్వేదంలోని అనేక ఋక్కులలో పుర, లేక పురు (మాటలకు ఉదాహరణలున్నాయి. గ్రాంథిక సంస్కృతంలో ఈ రెండు శబ్దాలకు 'పురము' 'నగరము' అని అర్థము. ఒక ఋక్కు (7, 15, 4)లో రాగి లేక ఇనుము (అయస్)తో చేయబడిన విస్తారమైన (శతభుజి) పురము పేర్కొనబడినది. ఇంకొక ఋక్కు (1,58,8)లో ఆరాధకుని <u>అయస్</u> పుర్‌లతో రక్షించమని అగ్నిదేవునికి ప్రార్థన చేయబడినది. అట్టి ఖండికలలో <u>అయస్</u> అలంకారికార్థంలో బలమును సూచించుటకుగాను స్పష్టంగా ఉపయోగింపబడినది. భూత పిశాచమైన సుస్నకు

1. Studies in the history of Indian philosophy Vol. 1
Editor:Debiprasad Chatopadhyaya, R.P.Chanda (Page-1)

కదిలించదగిన పుర (8,1,28) ఉన్నటుల చెప్పబడినది.

ఋగ్వేదంలో పుర పదము ఆర్య ఋషుల, యుద్ధవీరులలోకంటే ఆర్యుల శత్రువులలోటే మిక్కిలి తరచుగా సంబంధించియున్నది.

ప్రసిద్ధులైన ఇద్దరు ఋగ్వేద కాలమునాటి రాజులు, భరతులలోముఖ్యుడైన దివోదాస, మరియు పురులలో ముఖ్యుడైన పురుకుత్స విరోధులైన పురముల యజమానులపై యుద్ధములో నిమగ్నమైనట్లు కనుగొనబడినది. దివోదాస పరుష్ణి (రావినది) పడమర గట్టునగల యదుల, తుర్వశల, పురులతో వధ్రస్వ కుమారుడు మిక్కిలి కీర్తివంతుడైన సుదాసుని తాత. సుదాసుడు కలిసిన పది జాతుల సమాఖ్య రాజ్యమును జయించెను. ఇంద్రుడు తన నారాధించు దివోదాస కోసము రాతి (అశ్మన్మయీ)తో చేయబడిన నూరుపురాలను జయించెనని పేర్కొనబడెను. (4,30,20). ఇంద్రుడు దివోదాస కోసము జయించిన పురములు స్పష్టముగా శాంబరునికి చెందినవి. ఇతనినే పర్వత దాస అంటారు (6,26,5) ఇతడు ఆర్యేతరుడు (లేక రాక్షసుడు) ఒక మండలం (9,60,2)లో దివోదాస శత్రువులలో యదుల నాయకుడు యదుల మరియు శాంబరతోపాటు తుర్వశల నాయకుడు తుర్వశ పేర్కొనబడినది. పురుల ముఖ్యనాయకుడు పురుకుత్స తరపున ఇంద్రుడు చేసిన అత్యద్భుత కార్యము ఒక ఋక్కు (6,20,10)లో ఈ రీతి వర్ణింపబడినది :- "మేము తమ అనుగ్రహంతో నూతన సంపద పొందుదుముగాత. పురులు ఈ కీర్తన, బలులతో నిన్ను పూజింతురు. నీవు వజ్రాయుధంతో సప్తశరది పురాలను నాశనం చేసితివి. దాసులను వధించి వారి సంపదను పురుకుత్సున కిచ్చితివి." ఈ వివరణ ప్రాచీన భారతీయ నగరాలమీద గణాలమీద ఆర్యగణాల దాడులను మనకు వివరిస్తుంది.

ఆర్యుల నాయకుల్లో ప్రధానమైనవాడు దివోదాసు ఈతడు భారతీయ తెగలమీద, నగరాలమీద తీవ్రమైన దాడులు నిర్వహించాడు.

ఆనాడు దివోదాసుకు ఎదురు నిలిచి పోరాడినవాడు, దాసుల ప్రతినిధి శంబరుడు. ఋగ్వేదంలో శంబరునితో జరిగిన యుద్ధం గురించి ఎక్కువ చెప్పబడింది. భరద్వాజుడు, వశిష్ఠుడు, వామదేవుడు శంబరయుద్ధాన్ని గురించి ఋక్కులు చెప్పారు. శంబరుని రాజ్యం మహాపర్వతం దగ్గరవున్నట్లు వర్ణింపబడింది. శంబర జాతి ప్రజలు ఈనాటి దళితులే.

శంబరులకు, ఆర్యులకు ప్రధానంగా నీటి కాలువలదగ్గర ఘర్షణ వచ్చింది. ఆర్యులు సింధూ నగరాలకు నీటిని ప్రవహించకుండా అడ్డుపడి సింధూ నగరాలను ధ్వంసం చేశారు. శంబరులు ఆర్యుల భూములకు నీరు పారకుండా అదే ఆయుధం వుపయోగించారు. ఇక్కడే వారికి కలహయుద్ధం జరిగింది – ఈ విషయాన్ని వివరిస్తూ రాహుల్ సాంకృత్యాయన్ -

"వైదిక కాలంలో వృత్రుడంటే నీటిని అడ్డగించువాడని అర్థం. ఇంద్రుడు తన వజ్రంతో అతన్ని చంపి నీటిని విడుదల చేశాడు. శంబరునికూడా వృత్రుడన్నారు. సమకాలికులైన ఋషులు అతన్ని అసుర శత్రువు- మాయావి, ఇంద్రజాలికుడు అన్నారు. కాని అతడు మానవుడే. కాలం గడచినకొలదీ శంబరుని రూపం

మారిపోయింది. అతన్ని రాక్షసునిగా చిత్రించారు. పూర్వకాలంలో శంబర యుద్ధాన్ని ఇంద్రవృత్ర యుద్ధంగా చెప్పారు. పౌరాణిక కాలంలో ఇంద్రుని, శంబరుని, దివోదాసుని మరచిపోయారు. ఈ యుద్ధం దేవికి, జలంధరునకు మధ్య జరిగినట్లు వర్ణించారు.

మనకు ఋగ్వేదంద్వారా శంబర, దివోదాసుల యుద్ధం సంగతి తెలిసింది. శంబర జాతిని గురించి తెలియలేదు. అతని జాతీయులు 40 సంవత్సరాలు యుద్ధంచేసి లక్షలాది సంఖ్యలోచనిపోయారు. మిగిలినవారు యింకా దూరంగా కొండల్లోకి వెళ్ళిపోయారు. బియాసు, రావి ఎగువ ప్రాంతాల్లోవున్న చంబా, కులూ ప్రదేశాల్లో వారు చిరకాలంవరకు క్షేమంగా వున్నారు. కిరాతులను అక్కడనుంచి వెళ్ళగొట్టినవారు మధ్య ఆసియాలోని ఖస్సులు, వారు కిరాత భూమి నేపాలులో కూడా ప్రవేశించారు. అప్పుడుకూడా భయంకరమైన యుద్ధాలు జరిగివుండవచ్చు. కిరాతులు మైదాన ప్రదేశాలను విడిచిపోతూ వుంటే ఖస్సులు వాటిని ఆక్రమించుకొన్నారు". లొంగిపోయిన కిరాతులు కాలాంతరమున అస్పృశ్యులుగా పరిణామం చెంది వుంటారు. ఓడిపోయిన జాతులను బానిసలుగా చేసుకోవడం ఋగ్వేదకాలంలో వుంది. ఆర్యులు తమ విరోధులనందరినీ – సింధుజాతి వారిని కృష్ణయోనులు, దస్యులు అన్నారు. దివోదాసుకు వ్యతిరేకంగా పోరాడిన గణాలను ఋగ్వేదంలో ఇలా పేర్కొన్నారు.

1. పురులు[1]; 2. యదుత[2]; 3. తుర్వశులు; 4. ద్రుహ్యులు; 5. అనులు; 6. ఫక్తులు; 7. భలానులు; 8. విషాణులు; 9. అలినులు; 10. శివులు; 11. శిమ్యులు (గణాలు); 12. క్రివులు (గణాలు); 13. మత్స్యులు (గణాలు); 14. వైకర్ణ (వ్యక్తియా?); 15. కవషుడు; 16. దేవకమన్య మానుడు; 17. చాయమానకవి; 18. సుతుకుడు; 19. ఉచథుడు; 20. శ్రుతుడు; 21. బృద్ధుడు; 22. మన్యుడు; 23. వృధుడు; 24. భరతుడు.

---

వీనిలో ఆర్యగణాలుకూడా వున్నాయి. వారికి వారికి మధ్యలోకూడా యుద్ధం జరిగింది. ఆర్యగణాల్లో భరతులు, సృంజయులు ప్రధానమైనవి. ఆధిపత్యంకోసం ఆర్యగణాలుకూడా పరస్పరం సంఘర్షించుకున్నాయని రాహుల్ వివరించారు.

ఆర్యేతరుల్లో శక్తివంతమైన గణాలతో ఆర్యులు చాలాకాలం యుద్ధం చేశారు. అందులో ప్రధానంగా వారు పోరాడింది 'దాస' జాతిలో Rig Veda of the Dasas as being of Krishna Varna. అని అంబేద్కర్ వర్ణించారు. అంబేద్కర్ దస్యులు దాసులమీద ఆర్యులు పోరాడిన అంశాన్ని తన అత్యంత పరిశోధనాత్మక గ్రంథం Who were the Shudras' లో సాధికారికంగా వివరించారు.

"First is the paucity of references in the Rig Veda to wars between the Aryans on the one hand and the Dasas or Dasyus on the other. Out of the 33 places in which the word occurs in the Rig Veda only in 8 places is it used in opposition to Dasas and only in 7 places is it used in opposition to the word Dasyus. This may show the occurrence of sporadic riots between the two. It is

certainly not evidence of a conquest or subjugation.

The second point about the Dasas is that whatever conflict there was between them and the Aryans, the two seem to have arrived at a mutual settlement, based on peace with honour. This is borne out by refernces in the Rig Veda showing how the Dasas and Aryans have stood as one united people against a common enemy. Note the following verses from the Rig Veda.

vi 33.3; vii 83.1; viii 51.9; x 102.3

The third point to note is that whatever the degree of conflict, it was not a conflict of race. It was a conflict which had arisen on account of religions. That this conflict was religious and not racial is evidenced by the Rig Veda itself. Speaking of the Dasyus, it 15 says.

Attention may also be drawn to the Rig Veda x.22.8 which says :

We like in the midst of the Dasyu tribes, who do not perform sacrifies, nor believe in anything. They have their own rites and are not entitled to be called men. O! thou, destroyer of enemies, annihilate them and injure the Dasas.

In the face of these statements from the Rig Veda, there is obviously no room for a theory of a military conquest by the Aryan race of the non-Aryan races of Dasas and Dasyus.[1]

ఋగ్వేదంలోని 1017 సూక్తాలలో ఒక 40 మినహాయిస్తే మిగిలినవన్నీ దేవతా స్తోత్రాలే. పైగా అవి తమ శత్రువులను జయించడానికి, వారిని వధించడానికి శక్తినిమ్మని కొనియాడినవే. ఆనాడు వారికి ఎదురునిలిచిన ప్రాచీన భారతీయ జాతులు దస్యులు దాసులని నల్లని వర్ణముగల వీరిని వర్ణపరంగా, సంస్కృతిపరంగా జాతిపరంగా శత్రువులుగా ప్రకటించి వారితో సుదీర్ఘ కాలం యుద్ధంచేసి వారిపై కక్షకార్పణ్యాలు పూనారు. ఆది భారతీయులైన వీరిని అస్పృశ్యజాతులుగా ప్రకటించారు. ఈ విషయాన్ని అంబేద్కర్ తన 'అస్పృశ్యులెవరు?' లో చర్చిస్తూ, ఆ తరువాతికాలంలో ఆర్యుల మతసంస్కృతులను ఛాలెంజ్ చేసిన బౌద్ధమతాన్ని వీరు స్వీకరించినందువలన వీరిపై కక్ష మరింతగా పెరిగిందని నిరూపించారు. ఆర్యులు ఒక దశలో దస్యులను నిర్దాక్షిణ్యంగా వధించారుకూడా. ఈ విషయాన్ని రావ్ సాహెబ్ కస్బే [2] ఇలా వివరించారు.

1. Who were The Shudras?

- B.R.Ambedkar Page : 70–71.

2. హిందూ మతతత్వం ఒక పరిశీలన – రావ్ సాహెబ్ కస్బే (పేజీ – 50)

"భారతీయ చరిత్రలోని వేదకాలం మానవ చరిత్రలోని ప్రాకృతిక దశకు బానిస విధానానికి మధ్యగల సంధికాలం. ఉత్తర దిక్కునుంచి వచ్చిన ఆర్యులకూ, భారతదేశంలోవున్న ఆదిమ నివాసులైన దాసులు-దస్యులు- పణ్యాజీవులకూ మధ్య జరిగిన సంఘర్షణలకు సంబంధించిన వర్ణనలు ఋగ్వేదంలోని 4-16-13; 4-30-15; 7-99-5; 2-14-0; 6-22-6; 8-16-13; 9-130-8 ఈ ఋక్కుల నిండా వున్నాయి. ఇది బానిస విధానం అమలులోవున్న సామాజిక వ్యవస్థ యేర్పడటానికి పూర్వంవున్న కాలం కావడంచేత ఉత్తరదిక్కునుంచి వచ్చిన గౌర వర్ణీయులైన ఆర్యులు యిక్కడవున్న కృష్ణ వర్ణీయులను బాహాటంగా వధించారు".

యుద్ధంలో ఓడిన వారిని దాసులుగా, బానిసలుగా ఆర్యులు చేసుకున్నారు. వారు భారతదేశంలో బానిస వ్యవస్థను స్థాపించడానికి ఒక పెద్ద ప్రయత్నం చేశారు. ఈ విషయాన్ని రాహుల్ తన పరిశోధనలో నిరూపించడానికి ప్రయత్నించారు.

"యుద్ధంలో గెల్చినవారు ఓడిపోయిన శత్రు స్త్రీ, పురుషులను ఎక్కువమంది దాసీలుగా చేసుకొని పనిచేయించుకునేవారు. బానిస వ్యవస్థకాలంలో అంతటా యీ పద్ధతివున్నట్లు మనం గమనించాం. మనదేశంలో యీ బానిసత్వం (వెట్టిచాకిరి, ఊడిగం రూపంలో) 16వ శతాబ్దం రెండవ పాదంలో అంతమైంది. ఋగ్వేద కాలంలో గెల్చినవారికీ, ఓడినవారికీ రూపం, రంగు, స్వార్థంలో చాలా తేడావుంది. కావున అప్పటిలో బానిస విధానం అతిక్రూరంగా ఉందనుట వాస్తవం. బాలఖిల్య సూక్తాల్లో వృష్ణథ ఋషి యింద్రుని ప్రార్థించాడు. "నాకు నూరు గాడిదలు, నూరు గొర్రెలు, నూరుమంది దాసులను ప్రసాదించుము." (14-88-3). ఆర్యులు తమ శత్రువులను కూడా దాసులు, దస్యులు అనేవారు. తర్వాత కాలంలో అమ్ముడుపోయినవారిని దాసులు (బానిసలు) అన్నారు. పైన ఋషి నూర్గురు దాసులను కోరినందున నిస్సందేహంగా వారు జాతిలోను, పనిలోను దాసులే. గృత్స మద ఋషి (2-2-4) 'దాసః విశా' దాస ప్రజలన్నాడు. ఆయన వేరొకచోట దాసుల రంగు నికృష్టం అన్నాడు. ఋగ్వేదంలో త్రసదస్యుడు కణ్వపుత్ర శోభరికి 50మంది వధువులను యిచ్చినట్లుంది. (8-10-36, 37). ఇచ్చట వధూ శబ్దానికి అర్థం దాసి". 1

కృష్ణవర్ణులైన దస్యులు దళితులే అనుటకు ఎట్టి సందేహములేదు. ఋగ్వేదంలో వారి దేవతలను కొనియాడే విధానంలోనే ప్రాచీన భారతీయులైన దస్యులపైన వారి క్రోధం అభివ్యక్తమవుతూ వుంది.

వీరిని బానిసలుగా చేసుకోవాలని లేకుంటే సంఘ బహిష్కృతులను చేయాలనే కుతంత్రం వారి దేవతాస్తుతిలో మనకు స్పష్టం అవుతోంది - ఇంకా ఋగ్వేదంలోని కొన్ని సూక్తాలను పరిశీలిద్దాం -

"The terrible Aryan King well-armed and able to defeat its foes in battle, gradually brings the Dasa under its contrl". (Rg.V.34 to 36)

"Destroy, Indra, the tawny - coloured, fearfully-roaring Pishachi,

1. ఋగ్వేద ఆర్యులు - రాహుల్ సాంకృత్యాయన్ (పేజీ - 53)

annihilate all the Rakshasas". (Rg.V.Mandal–1, Anuvaka XIX Sookta – 7, Verse – 5)

"Crush the anaryan Dasus with the Weapons". (Rg.V.52.9.10)

"We are surrounded on all sides by the Dasyus. They do not perform sacrifices. They are unbelieve. Their practices are all different. They are not men O! destroyer of foes kill them or destory the Dasa race" (Rg.V.100–8)

"Crush under your jaws those despicable curs which bark at us on every side. Sky the foes. O! Aswanis, you know. all you, Nasatya, accept this hymn of mine with favour, and reward every word of him who praises you".

(Rg.V.Mandal–1, Anuvaka–24, Sookta 111 (182) Verse–4)

ఋగ్వేదమందు ఉదహరింపబడిన ఈ ఉదాహరణలు ఆనాటి ఆది భారతీయులను జయించడానికి ఎన్నో సాయుధ దాడులు ఆర్యులు చేసినట్లు రుజువు చేస్తున్నాయి. ఆర్యులు తమ క్రూరమైన, పాశవికమైన దాడులలో ఆది భారతీయులను వధించడం, హింసించడం, వారి ఎడల కఠినంగా ప్రవర్తించడమేకాక వారిపైన ద్వేషాన్ని పూనారు అనేది స్పష్టమవుతుంది. అందుకే ఆర్యుల ప్రధానగ్రంథమైన ఋగ్వేదంలో ఏదో అతీతమైన విజ్ఞానం వుందని ప్రచారం చేస్తున్నారు. వాస్తవానికి అందులోవుంది విజ్ఞానం కాకపోగా భారత ఆదిమజాతులమీద కక్షా, కార్పణ్యాలే మిక్కుటంగా కనిపిస్తున్నాయి. అందుకే వేదాల్లో ఏ ఋషి ఏ దేవతను, ఏ అంశంకోసం పూజించారో కొన్ని మండలాలను ఈ క్రింద వివరిస్తున్నాను.

| ఋక్కు | సూక్తం | అనువాకము | ఋషి | విషయం |
|---|---|---|---|---|
| 50 | 2 | ప్రథమ | విశ్వామిత్ర పుత్రుడగుమధుచ్ఛన్దనుడు | ఇంద్రునితో శత్రువుల నుండి మమ్ము రక్షించమని కోరుతున్నాడు |
| 55 | 3 | ప్రథమ | ” | గుహలో దాగియున్న గోవులను సంపాదించిన ఇంద్రుని స్తుతించుట |
| 64 | 47 | ప్రథమ | ” | ఇంద్రునితో శత్రువుల నుండి కాపాడమని అభ్యర్థించుట |
| 73 | 8 | తృతీయ | ” | యుద్ధములందు శత్రువులను జయించమని |

| | | | | |
|---|---|---|---|---|
| 74 | 8 | తృతీయ | ” | ఇంద్రుని కోరుట ఆయుధహస్తులైనమేము శత్రువులను ఓడింతుమని ఇంద్రునికి చెప్పుట |
| 75 | 8 | తృతీయ | ” | ఇంద్రుని శారీరక నిర్మాణము ఆతని ఆకారము లను గూర్చి పొగడుట |
| 78 | 8 | తృతీయ | ” | ఇంద్రుని వాక్కు యుద్ధ ప్రేరణయని వర్ణించుట |
| 81 | 8 | తృతీయ | ” | సోమ ప్రియుడైన ఇంద్రుడుసోమరసమును సేవించి శత్రువుల నోడించమని అభ్యర్థించుట |
| 506 | 42 | 8 | ఘర పుత్రుడగు కణ్వుడు | బాధించుటకు వచ్చిన శత్రువులను దూరముగా తీసుకుపొమ్మని వేడుకొనుట |

ఆర్య ఋషులు తమ దేవతలైన ఇంద్ర, వరుణ, అగ్ని మొదలగువారిని తమ శత్రువులుగా భావించిన ఆది భారతీయులను జయించుటకు శక్తినిమ్మని ప్రార్థించుటయే ప్రధానంగా ఋగ్వేదంలో కనిపిస్తుంది.

ఆర్యగణాలకు నాయకత్వం వహించిన వారి వివరాలు కూడా ఋగ్వేదంలో కోకొల్లలుగా దొరుకుతున్నాయి. వారిలో దధ్వజ (దధీచుడు), రుమ, రుశమ, శ్యావక, కృప, బధ్ర్యశ్వ, భరద్వాజ, అభ్యావర్తీ వాయమానుడు, సుమీధుడు, పురుసీధుడు, ప్రసోక్తుడు, కుత్స, అర్జునేయ, శ్రుతర్య, తుర్వీతి, దభీతి, ధ్వసంతి, పురుషాంత, దేవక మన్యమానదు, సుశ్రవ, తుర్వయాణుడు, ఋణంచయుడు, పాకస్థామ కౌరాయణుడు, దేవశ్ర, దేవదాత, సృంజయదైవదాత, మహిరాధ పాజ్రయ, పురుకుత్సుడు, త్రసదవస్య, పౌరకుత్సుడు, కురుశ్రవణ, త్రసదస్యుపుత్ర ముఖ్యులుగా కనిపిస్తున్నారు.

ఆర్యులు ఆది భారతీయులపై యుద్ధం చేయడానికి ధనస్సును, వింటి నారిని, గొడ్డలిని ప్రధానంగా ఉపయోగించారు.

మొదట్లో గుర్రాలు, రానురాను గుర్రాలు పూన్చిన రథాలు వాడారు. కుతంత్రపూరితమైన వ్యవహారాలతో వారు యుద్ధ తంత్రాలు నిర్వహించారు.

అశ్వాన్ని వారు ప్రధాన వాహనంగా యుద్ధానికి ఉపయుక్తం చేశారు. విశ్వామిత్రుడు తన గణాలు అగ్ని పూజ ప్రధానంగా గలిగి గుర్రం ప్రధాన వాహనంగా కలిగి శత్రువులను జయిస్తున్నట్లు చెప్పుకున్నారు.

అశ్వానక్రందన్ జనిభిః సమిధ్యతే
వైశ్వానరః కుశికేభిర్యుగేయగే
సనో అగ్నిః సువీర్యం, స్వశ్యం దధాతు
రత్న మమృతేషు జాగృవిః (3-26-3)

("వైశ్వానర అగ్ని అశ్వంవలె సకిలిస్తూ కుశికులచే యుగయుగములందు ప్రజ్వరింపబడుతుంది. అమృతములందు జాగరూకమైన అగ్ని మాకు బలమును, మంచి అశ్వాలను, మంచి రధాలను ప్రసాదించుగాక")

అశ్వం ఆర్యులతోనే భారతదేశానికి వచ్చింది. ఆర్యుల రోజుల్లో ప్రధానులైన శాతవాహనుల నాణాల్లో ఈ గుర్రం ప్రముఖంగా ముద్రించబడింది. 'శాతకర్ణి' అనగా 'గుర్రం చెవి' అని అర్థం, శత అనగా గుర్రము ఈ విషయాన్ని వివరిస్తూ డి.డి.కొశాంబి-

"The name Satakarni appeal to be aboriginal. The factors all two Indo-Austria words sada = horse, and kon=son, which would indicate a horse - totem of the non Aryans, The formation cannot go back to pre-Aryan days, as the horse, which appears on many Satavahan coins, is an Aryan innovation for India. The dynasty Could be the Assaka of SN 1977. The proper sanskritization of state is sapti (horse), which actually appears in a late purana. Saptikana would indicate a split - totem, 'horse-ear" 1

ప్రసిద్ధ చరిత్రకారుడు ఆర్.ఎస్.శర్మ తన పరిశోధనాత్మక గ్రంథం 'ప్రాచీన భారతంలో శూద్రులు'లో ఈ విధంగా వివరించారు.

" According to the authors of the Vedic India pani in the Rg veda denotes a person who is rich, but who does not give offerings to the gods, or bestows daksinas on the priests, and who is therefore an object of intense dislike to the composers of the Samhita.. 2

ఆర్యులు శక్తివంతమైన గుర్రంతో, ధనస్సుతో, ఆర్యేతరులను నిర్జించటానికి ప్రతినిత్యం యుద్ధానికి కాలుదువ్వుతుండేవారు. ఈ యుద్ధం ఆర్యులకు ఆర్యులకు మధ్యగూడా జరుగుతుండేది.

ఆర్యుల్లోనొక వంశమైన భరతులకు రాజైన సుదాసునకు విశ్వామిత్రుడు

---

1 (An Intoduction to the study of an Indian history - D.D. Kosambi - Page 243, 244)

2. R.S. Sarma, Sudras in Ancient India (1958), P. 19.

పురోహితుడు. వారి యుద్ధకాంక్షనుగూర్చి విశ్వామిత్రుడు ఇంద్రునికి నివేదిస్తూ -

ఇమ ఇంద్ర భరతస్య పుత్రా అప్రపిత్వం
చేకితుర్న ప్రపిత్వం ॥
హిన్వన్ త్వ్యశ్వ మరణం ననిత్యం జ్యావాజం
పరిణయన్ త్వా జే ॥ (3-53-24)

"ఓ ఇంద్రుడా! భరత పుత్రులకు యుద్ధం తెలుసు. ఐక్యత తెలియదు. శత్రువులవైపుకు గుర్రం పంపుతారు. ఇక్కడ ప్రతినిత్యం యుద్ధానికి ధనుస్సు ధరిస్తారు".

ఆర్యులు తమ రాజ్య విస్తరణకొరకు అశ్వమేధయాగం చేశారు. రాజ్య విస్తరణకు బలమైన అశ్వాన్ని వదిలి అది చుట్టినంత మేరకు తమ రాజ్యంగా ప్రకటించుకున్నారు. ఈ అశ్వంపై వారు యాగాన్ని నిర్మించి చక్రవర్తికి అశ్వమేధ యాగం చేయడం అనివార్యంగా నిర్ధారించారు. అశ్వమేధం మూడు రోజులు జరుగుతుంది. అందు మొదటి రోజును చతుష్టోమమనీ, రెండవ రోజున ఉక్థ్యమనీ, మూడవరోజును అతి రాత్రకమనీ అంటారు.

శ్లో॥ త్రిహోహాశ్వమేధస్సంఖ్యాతః; కల్పసూత్రేణ బ్రాహ్మణైః

కల్ప సూత్రేణ = యాగక్రమమును దెల్పెడి కల్పసూత్రము చేతను;
బ్రాహ్మణైః = వేదముల యందలి విధి వాక్యముల చేతను
అశ్వమేధః = అశ్వమేధయాగము, త్రహ్య; మూడుదినములు కలదిగా
సంఖ్యాతః = లెక్కింపబడినది (వాల్మీకము బాలకాండ 4వ సర్గ 38వ శ్లోకము)
సూత్రము = ప్రక్షా వితేషు మహి వ్యశ్వముప సంవిశత్యాహ మజానీతి
(కాత్యాయన శ్రేత సూత్రము-50-20-6-14)
తాత్పర్యము = పశువుయొక్క ప్రాణము పరిశుద్ధమైన పిదప యజమాని భార్య గుర్రము దగ్గర పరుండి-అని పై సూత్రమునకు భావము.
మంత్రము = గణానాం త్వా గణపతి హవామహే
ప్రియాణాం త్వా ప్రియపతి హవామహే
నిధీనాం త్వా నిధిపతి హవామహే
వసోమయ అహ మజాని గర్భధమాత్వమజాసి గర్భధమ్
-యజుర్వేదము, 23 అ 19వ మంత్రం

ఈ మంత్రమునకు మహీధరుడీ విధముగా భాష్యమును వ్రాసెను.

అస్యమంత్రస్య వ్యాఖ్యానే తేనోక్తమస్మిన్ మంత్రేణ
గణపతి శబ్దా దశ్వోవాజీ గ్రహీతవ్య ఇతి-తద్యథామహిషి

యజమానస్య పత్నీ యజ్ఞ శాలాం పశ్యతాం సర్వేషా మృత్వి జామశ్య సమీపేశేతే
శయాన సత్యాహమే అశ్వ! గర్భధం గర్భందదాతి గర్భదం గర్భదారకం రేతః
అహం ఆ అజాని-అకృష్యక్షి పామిత్వం గర్భధంరేతః ఆ అజాసి అకృష్యక్షిపసి-

వివరణ : ఈ మంత్రమునగల గణపతి శబ్దమునకు మహీధరుడు గుఱ్ఱమని అర్థము వ్రాసెను. మరియు ఋత్విజులందరి ఎదుట యజమానుని భార్య గుఱ్ఱము

దగ్గర పరుండి గుఱ్ఱముతో నిట్లు చెప్పుచున్నది. ఓ అశ్వమా! గర్భము ధరించుటకు తగినటువంటి నీ వీర్యమును నేను లాగికొని నా యోనియందు ధరించుచున్నాను. ఏలయన ఆ వీర్యమును నాయందు ధరించెడుదానవై యున్నావు.

మరియొక సూత్రము తిలకింపుము.

సూత్రము : అశ్వశిశ్నే ముపస్తే కురుతే వృషావాజీతి

(కాత్యాయన శ్రౌత సూత్రం కాం. 20-6-16)

మంత్రము :

తాఽ ఉభేచతురః సంప్రసార యామసర్వేలోకే ప్రోర్ణువాథాం
వృషావాజీరేతో ధారేతో దిధాతు

(యజుర్వేదము 23 అ 20 మం.)

మహీధర భాష్యము : అశ్వశిస్నే ముపస్థే కురుతే వృషావాజీతి మహిషీ
స్వయమేవాశ్విశిశ్న మా వృష్య స్వయోనే స్థాపయతి

వివరణ : యజమానుని భార్య గుఱ్ఱపు శిశ్నమును స్వయముగా బట్టుకొని తనయోని యందుంచుకొనవలెను. మరియొక దృష్టాంతము.

ఉత్యక్థ్యా-అవ-గుదందేహి-సమంజం-చారయాపుషన్-యః-స్త్రీణాం-జీవ భోజనః-
యజుర్వేదము (23 సర్గ-2 మ)

భాష్యము :

యజమానోఽ శ్వమంత్రయతే-హేవృషన్, సేకుః అశ్వ! ఉత్ ఊర్ధ్వేసక్థినీ ఊరూమస్యా మహిష్యాగుదమవగుదో వరిరేత్రాదేహి వీర్యం ధారయ కథమ్-తదాహ అంజిం లింగం సంచారయ-యోనౌప్రవేశయ యోంజిః
స్త్రీణాం జీవభోజనః-యస్మిన్ లింగే యోనౌప్రవిష్టే స్త్రియో జీవన్తి-భోగాంశ్చలంభం కేతం ప్రవేశయ-

భావము : వీర్యసేచన మొనర్చు అశ్వమా! నీవు నా స్త్రీ జంఘములను పైకెత్తి ఆమె గుదమున వీర్యముంచుము. ఆ లింగమెట్టిది? లింగము యోనియందు ప్రవేశించినపుడా లింగమువలన స్త్రీలకు జీవనము గలుగుచున్నది. మరియు దానితో వారు భోగమును అనుభవించుచున్నారు. కావున నీవు ఆ లింగమును నా స్త్రీ యోనియందుంచుము.

శ్లో॥ హోతాధ్వర్యుస్తదోద్గాతా, హస్తేన సమయోజయన్
మహిష్యా పరివృత్యాచ, వావాతాంచ తథాపరం

అర్థం : హోతః హోతయును, అధ్వర్యుః అధ్వర్యువును, ఉద్గాతా ఉద్గాతాయును, తథా = (ఇది అనుక్త సముచ్చాయకము) బ్రహ్మయును, మహిష్యా = పట్టపు దేవితోను, పరివృత్యాచ = పరివృత్తితోనుగూడా

వావాతాం = వావాతను, తదా = అట్లు ఆపరాం = ఇప్పుడు చెప్పబడిన

వారికంటె నితరయగు పావాకలిని, హస్తేన = తమ హస్తముతో, సమయోజన్=గ్రహించితిరి.

తాత్పర్యము : దశరధుడీయగా హెూత కౌసల్యను-అధ్వర్యువు పరివృత్తిని ఉద్గాత వావాతిని-బ్రహ్మ పాలాకలిని పాణిగ్రహణము గావించిరి.

విశేషములు : ఇందు (1) మహిషి (2) పరివృత్తి (3) వాతాత (4) పాలాకలి అను నాయికలు కలరు. ఇది వైదిక పరిభాషయగుటచే సామాన్య నిఘంటువులో వివరణ లేదుకాని, వైజయంతీ నిఘంటువులో-

శ్లో॥ : కృతాభిషేకామహిషీపరివృత్తురుపేక్షితా,
వావాతా భోగినీ-పాత్ర ప్రదాపాలకలీమతా అని వున్నది.

పై వివరణనుబట్టి ఆర్య రాజులైన దశరధుడు మొదలుగా గలిగినవారు అశ్వమేధయాగమును అత్యంత హేయమైన పద్ధతులలో ఆచరించారని తెలియుచున్నది. అనార్యులైన ఆది భారతీయులకు ఈ అశ్వమేధమునకు ఎటువంటి సంబంధములేదు. అశ్వమేధ యాగ నిర్వహణనుబట్టి ఆర్యులది అరాచక సంస్కృతని మనకు అభివ్యక్తమౌతుంది. ఇటువంటి అరాచక సంస్కృతిని ఎదిరించారు కావున ఆది భారతీయులంటే ఆర్యులకు కక్షా కార్పణ్యాలు పెరిగాయి. ఆది భారతీయులు స్త్రీలను గౌరవిస్తారు. మూఢనమ్మకంతో, అశ్వమును స్త్రీలతో రమింపజేసే దుష్టక్రియలను ఆదిభారతీయులు బాగా నిరసించి వుండవచ్చు. పితృస్వామిక అరాచకవాదులైన ఆర్యులకు, మాతృస్వామిక సమతావాదులైన ఆదిభారతీయులకు స్పష్టమైన వైరుధ్యాన్ని ఈ అశ్వమేధయాగ నిర్వహణ నిరూపిస్తుంది.

ఆర్యులు సోమపాన మత్తులు. ఒకరకమైన సురను వారు సేవించేవారు. ఋగ్వేదంలోని తొమ్మిదవ మండలం ప్రధానంగా సోమపానాన్ని గురించే వివరించబడింది. విశ్వామిత్ర పుత్రుడైన మధుచ్ఛందసుడు వ్రాసిన సూక్తంతో ఈ మండలం ప్రారంభమవుతుంది. ఇందులోని మొదటి ఋక్కే సోమపానాన్ని గూర్చి విశేషంగా వివరిస్తుంది.

స్వాదిష్ఠయా మదిష్ఠయా పవస్వ సోమధారయా
ఇంద్రాయ పాతవే సుతః ॥

"ఓ సోముడా, నీవు ఇంద్రుడు త్రాగుటకొరకు వడకట్టబడి, స్వాదిష్టమై, మదిష్టమై ధారగా ప్రవహించుము.

ఆర్యులు సోమపానాన్ని తాము చేయటమేగాక తమ తమ దేవతలకు కూడా సమర్పించేవారని, ప్రొ॥ సి. కన్హన్ రాజా యిలా వివరించారు :

"Sura is used alongwith soma, (or) as a substitute for soma, in some of the sacrifices. It cannot be a condemned article, it is offered to the gods along with, or a substiture for, soma"[1]

1. The culture heritage of India - Vol I - Page 217

ఈ విధంగా సుఖలాలసులైన ఆర్యులు ఆదిభారతీయులను నిర్దాక్షిణ్యంగా కొల్లగొట్టి అలా గడించిన సంపదతో సోమపాన మత్తులై సుఖించేవారని అర్థమౌతుంది. ఇతర తెగలపై యుద్ధాలు చేయడం, వారి ఆస్తులను కొల్లగొట్టడం, వారి భూములను ఆక్రమించడం, వారి జంతువులనపహరించడం వాటిని వధించి ఆబగా మేసి మత్తులై తమ దేవతలను కొనియాడడం వంటి అరాచక కృత్యాలను ఎదిరించి నిలిచిన ఆదిభారతీయులు చరిత్రాత్మకమైన పాత్రను నిర్వహించారు.

ప్రసిద్ధ చరిత్రకారుడు ఆర్.ఎస్.శర్మ తన పరిశోధనాత్మక గ్రంథం "ప్రాచీన భారతంలో శూద్రులు"లో ఆది భారతీయులైన దస్యులు, ఆర్యులను ఎదిరించి నిలవటమేగాక, ఆనాటికే అభివృద్ధి చెందిన ప్రాచీన భారతీయ సంస్కృతికి వారు ప్రతినిధులని ఋగ్వేదం ఆధారముగా నిరూపించాడు.

The fight between the aryans and their opponents mainly took the form of destruction of the fortresses and walled settlements of the catter. Both the Dasas and Dasyus were in the possession of numerous fortified settlements, which are also associated with the Enemies of the Aryans in a general way. This naturally reminds us of the cater discoveries of fortifications in the Harappa settlements although so far we have not been able to get any clean archaeological evidence of mass - scale confrontation between the aryans and the Harappans. It seems that the nomadic Aryans Coveted the wealth of their enimies accumulated in the settlements for the possession of which there went on.

"The DASYu Way of life further antagonised the Aryans. Apparently the tribal and semi-Settled life of the Aryans based on cattle keeping was incompatible with the sedentary and urban life of the people of the indigenous culture.[1]

సంచార తెగలైన ఆర్యులు బలులిచ్చుకుంటూ గణజీవితాన్నే జీవించారు. గణం, సభ, సమితి, విధాత అనేవి వారి వ్యవస్థలో ముఖ్య విభాగాలు. కాని నాగరీకులైన దస్యులు బలులిచ్చేవారుకాదు. కర్మ-క్రతువులు చేసేవారు కాదు. ఇంద్రుడిని పూజిస్తూ ఋగ్వేదంలో చెప్పబడిన రుక్కులలో దస్యులు బలులిచ్చేవారు కాదని కర్మకాండ చేసేవారు కాదని వారిని నిందిస్తూ వర్ణించారు. ఆర్యుల దృష్టిలో బలులివ్వని దస్యులు దేవుని దూషించేవారుగా, క్రూరులుగా అభివర్ణించబడినారు. ఈనాటికీ ఈ వైరుధ్యం కొనసాగుతుంది.

ఆర్యులు తమ తెగలకు సంబంధించిన ఆచారాలను 'వ్రత' అని పేర్కొన్నారు. వాటిని పాటించని నాగరికులైన దస్యులను 'అవ్రత' లేక 'అన్యవ్రత' అన్నారు.

Sudras in Ancient India by R.S. Sarma - page - 13

ఆర్యులు తమని తాము మానవులుగా వర్ణించుకొంటూ, స్థానిక నాగరిక జాతులను 'రాక్షసు'లుగా వర్ణిస్తూ, వారి నివాసాలను తగలబెడుతూ వారిని వధించారు.

ఆర్యుల దేవతైన ఇంద్రుడు ఒక సందర్భంలో 50 వేల మంది నల్లవారిని వధించినట్లు పేర్కొనబడింది.

" The Aryan deity soma described as killing people of black skin, who apparently were dasyus. Further, Indra had to contend against The Raksasas of Black Skin. (TVACAMASIKNIM) and at one place he is credited, with the slaughter of the fifty thousand 'blacks (Krishnas) whom sayana regards as the Raksasas of black colour" [1]

ఆర్యుల హింసాకాండను, అరాచక దాడులను ఆది భారతీయ తెగల తరుపు నుండి కృష్ణుడు అనే నల్ల ప్రజల నాయకుడు ఇంద్రుడ్ని ఎదుర్కొన్నట్లు, వారిద్దరికి మధ్య యుద్ధం నడిచినట్లు ఋగ్వేదం పేర్కొంది.

ఋగ్వేద కృష్ణుడు పౌరాణిక కృష్ణుడు ఒకటి కాదు. 'కృష్ణ' అన నలుపని అర్థము. సహజంగా అనార్యులందరినీ ఆర్యులు నల్లవారని పిలిచేవారు. దస్యులు, దాసులు కూడా నల్లని వారని పిలవబడ్డారు.

భారత దేశంలోని నల్లవారిపై ఇంద్రుడు, అగ్ని సోమమెదలుగా గల వైదిక నాయకులు పోరాడారని చెప్పబడింది. మరీ ముఖ్యంగా ఋగ్వేదనాయకుడైన పురుకుత్సుని కుమారుడు ' త్రిసదస్యుడు నల్లని వారిపై ఆధిపత్యం కలవాడని వర్ణింపబడ్డాడు.

" Aryan followers of Indra, Agni, and soma had to fight against the black people of India. In one reference, the Rigvedic hero Trasalasya, son of purukutsa is described as the leader of the dark-Complexioned men this may indicate that he had established his hold over them. [2]

నాస అనగా ముక్కు అని అర్థం.

అనాస అనగా ముక్కులేని అని అర్థం. దస్యులను ఆర్యులు అనాస అని పిలిచారు. అంటే దస్యులు చప్పిడిముక్కుకలవారని అర్థం. వీరిని బొబ్బపెదవులు (Bull lipped) కలవారని పిలిచేవారు. దీనిని బట్టి ఆర్యులకు అనార్యులు భిన్నమైన శారీరక అవయవ నిర్మాణం కలిగి ఉన్నారు.

ఆర్యులు తమను తాము మృదువాక్ కలవారిగా అభివర్ణించుకున్నారు.

[1] Sudras in Ancient India by R.S.Sarma- Page-14

[2]. ibid - page - 15

అనార్యులభాషను ద్వేషించారు. ఆర్యులకు - అనార్యులకు రంగులోను, అవయవ నిర్మాణంలోను, భాషా సంస్కృతులలోను ఉన్న తేడాతో పాటు సంచారతెగలకు స్థిర నివాసులకుండే వైరుధ్యంతో పాటు ప్రధానంగా ఆస్తులు, పశుసంపద, రథాలు అనేక ఇతర రూపాల్లో ఉన్న సంపదకు సంబంధించిన అంశాలు వీరి మధ్య యుద్ధానికి అసలు కారణాలుగా ముందుకొచ్చాయి.

పశుసంపద ప్రధానంగా గల ఆర్యులు భారతదేశంలో ప్రధాన శక్తులైన దాస-దస్యుల మీద అనేక దాడులు చేసి రక్తపుటేరులు ప్రవహింపచేశారు. వారి కసికి తార్కాణంగా ఋగ్వేదంలో దస్యులు 84 సార్లు, దాసులు 61 సార్లు నిందాపూర్వకంగా పేర్కొనబడ్డారు. ఈ విషయాన్ని ధృవీకరిస్తూ ఆర్.ఎస్. శర్మ ఇలా వివరించారు.

"If inferences can be drawn from the relative occurances of the terms dasa and dasyu in the rigveda, it would appear that the Dasyus, who are mentioned eighty four times were abviously numerically stronger than the Dasas, who are mentioned sixty one times the struggle against the Dasyus. was attended with much bloodshed. The Aryans who in the early stage of their expansion covered cattle for their upkeep, naturally did not understand the value of urban settlements and organised agriculture. [1]

అనాగరిక జాతులైన ఆర్యులకు నగర వ్యవసాయ సంస్కృతుల విలువలు తెలియక ఆ సంస్కృతులను నాశనం చేయడానికి ఎక్కువ ప్రయత్నించేవారు. అనార్యుల నగర జీవనం మీద దాడులు చేసినట్లు హరప్పాదగ్గర నుండి ఎన్నో ఉదాహరణలు దొరుకుతున్నాయి. సాయుధులైన సైనికులతోను, పశుబలంతోను వారు ఈ దాడులను నిర్వహించేవారు. రాను రాను వ్యవసాయ సంస్కృతిలో వున్న పట్టును వారు గమనించి తాము ఓడించిన అనార్యతెగలను వారు స్వాధీనం చేసుకున్న వ్యవసాయ భూములలో శ్రమ జీవులుగా ఉపయోగించారని మనకు తెలుస్తుంది.

ఆర్యులు దస్యులను జయించి వారి స్త్రీలను బానిసలుగా చేసుకున్నారు.

మొదటి ఋగ్వేద కాలం నాటికైతే చిన్న ఆడబానిసల వర్గమున్నది. ఆర్యుల శతృసంహారానంతరం వారి స్త్రీలు బానిసత్వానికి దించబడినట్లుగా కనిపిస్తుంది. ఈ విధంగా పురుకుత్స కుమారుడు త్రిసదస్యు ఏబది ఆడవాళ్లను బహుమతులుగా ఇచ్చినట్లుగా పేర్కొన బడుచున్నది. అధర్వణ వేదంలోని మొదటి భాగాలలో ఆడబానిసల ఉనికికి సాక్ష్యం దొరుకును. ఆ గ్రంధాలలో బానిస స్త్రీలు తడి చేతులతో రోకలి, రోలు తుడుస్తున్నట్లు ఆవుపేడపై రసాయనం పోస్తున్నట్లుగా వర్ణించబడినది. ఆమె ఇంటిపనిలో నిమగ్నమైనట్లు ఇంతకుముందే గమనించాము.

ఈ సంకలనం (అధర్వణవేదం) దాసి గూర్చి చాలా చక్కటి ఉదాహరణ ఇస్తున్నది. కావున వైదిక సమాజంలో ఆడ బానిసలు ఇంటి పనికి

[1] idid page - 16

వినియోగించబడినట్లు ఈ ఉదాహరణలు సూచిస్తునాయి. దాసి శబ్ద ప్రయోగం జయింపబడిన దీనులలో స్త్రీ జనం ఉన్నారని స్పష్టపరుస్తుంది.

"The use of the word 'dasa' in the sense of slave is to be found mostly in the later of the Rigveda.

బానిస భావంలో దాస శబ్ద ప్రయోగం ఋగ్వేదంలోని తరువాయి భాగాలలో ఎక్కువగాకనుగొనవచ్చు.

"The Valakhilya mentions hundred slaves, who are placed in the same Category as asses and sheep. The word Dasa pravargo in another later reference may mean wealth or assembelge of slaves. This would suggest that the end of the vedic period slaves increased in number, but there is no evidence of being engaged in productive activities.[1]

గాడిదలతో, గుర్రాలతో సమాన స్థాయిలో ఉంచబడ్డ వందమంది బానిసల గూర్చి వాలఖిల్య పేర్కొంటున్నదని దీని అర్థం. తదుపరి ఉదాహరణలో "దాస ప్రవర్గ" అనే పదానికి బానిస సంపద లేక 'బానిససమూహం' అన్న అర్థం వస్తుంది. వైదిక కాలాంతానికి బానిసల సంఖ్య పెరుగుతుందని ఇది సూచిస్తుంది. ఐతే ఉత్పత్తి పనిలో బానిసలను ఉపయోగించినట్లుగా సాక్ష్యం లేదు.

పూజారి దీర్ఘతమునికి కూడా బానిసలున్నట్లు ఒక ఉదాహరణ కనిపిస్తుంది. పశువులతో సమానంగా వీరు చూడబడ్డారు.

"They could be freely given away with the catttle. It seems that failure to pay debts resulted in the enslavement of the defaulter. But the very name 'dasa' shows that was the most important source of slavery during the vedic period"[2]

పశువులతో బాటు బానిసలను నిరాటంకముగా ఇచ్చివేయవచ్చు. అప్పులు చెల్లించడంలో విఫలమవ్వడంవల్ల ఆ అపరాధి 'బానిసత్వం' చేయవలసి వస్తుంది. (అనుభవించవలసి వస్తుంది). క నీ "దాస" అను పేరు వైదికకాలంలో బానిసత్వానికి మూలం యుద్ధం అని "సూచిస్తుంది.

ఋగ్వేద పురుష సూక్తకాలం వచ్చేనాటికి వీరిని వర్ణవ్యవస్థలో నాలుగవ వర్ణం క్రింద వ్యవహరించారు. బానిస వ్యవస్థకు పునాదులు వేసిన ఆర్యులు అనార్యులను సాంఘికంగా, ఆర్థికంగా సామాజిక చక్రంలో అడుగు భాగంలోకి నెట్టివేశారు. ఆనాటి నుండి ఈనాటి వరకు ఆర్యులు అనార్యులను అణచివుంచాలనే ప్రయత్నాన్ని కొనసాగిస్తూనే వున్నారు.

"పరస్పరం సంఘర్షించిన శక్తులతోనేకదా 'చరిత్ర' జననం"

---

Ibid - Page - 25 2. Ibid - Page - 25

# చివరి మాట

ఈ భాగంలో మీరు దళితుల చరిత్రను ఋగ్వేదకాలం వరకు చదివారు. రెండవ భాగం అక్కడనుండి ప్రారంభమౌతుంది. యజుర్వేదకాలం. బ్రాహ్మణాలకాలం, ఇతిహాసాకాలం దాటి మౌర్యుల యుగం వరకు దళితుల పోరాటాలు, ఓటములు, పరిణామాలు సోదాహరణంగా పేర్కొనబడతాయి. మొదటిభాగంలో చారిత్రాకంగా మీ ముందుకు తెచ్చిన అంశాలకు వీలున్నంత వరకు ప్రమాణాలతో ఇవ్వడం జరిగింది. సప్రమాణంగా ఎవరైన ఏ అంశం మీదనైనా చర్చకురావచ్చు.

ఈగ్రంథం 28-4-1991న మద్రాసులో దళితమహాసభ మద్రాసుశాఖ వారి ఆధ్వర్యంలో ఆవిష్కరించబడింది. ఈ ఆవిష్కరణ సందర్భంలో ఆవిష్కర్త శ్రీ మేడిశెట్టి తిరుమలకుమార్ I R S మాట్లాడుతూ "ఈ రచయిత చరిత్ర దర్భంలో దాగిన దళితుల చరిత్రను పరిశోధించి వెలికితీసిన సత్యాలతో సప్రమాణంగా ఈ గ్రంథాన్ని రచించి భావితరాలకు వెలుగు బాటను నిర్మించారు. ఈ గ్రంథానికి దక్షిణాఫ్రికాలోని నల్లజాతి ప్రజలను ఎలెన్‌హెక్స్లీ వ్రాసిన ఏడుతరాలు (Roots) ఎంత ప్రభావితం చేసిందో అంత ప్రభావితం చేయగలశక్తివుంది.

దళిత జాతులకు ఆత్మస్థైర్యాన్ని కలిగిస్తున్న ఈ గ్రంథం దళితుల సాంఘిక, రాజకీయ ఉద్యమాన్ని విజయవంతం చేయడానికి ఒక ఆయుధం అవుతుందనడంలో సందేహంలేదని" అన్నారు ఈ ఆవిష్కరణ కార్యక్రమాన్ని శ్రీ కత్తి ధనరాజు, శ్రీ యన్. అమృతరావు, శ్రీ డి. పి. ఆర్. ప్రసాదు శ్రీ మేరుకొండ కోటయ్య శ్రీ కె. మునేశ్వరరావు శ్రీ చెన్నయ్య నిర్వహించారు.

చివరి భాగమైన ఆర్యులు, అనార్యుల్లో కొన్ని పేజీలు ఆఫ్‌సెట్‌లో ముద్రించాము. 72 నెంబరు పేజీల్లో రెండుగీతలు పేజీలకు మధ్యలో ముద్రించబడ్డాయి. వాటిని గమనించి వరుసగా చదవగలరని ఆశిస్తున్నాము లోకాయత గృహ గ్రంథాలయ సంస్థద్వారా ఈ పుస్తకాలను పంపిణీ చేస్తున్నాము. 100 రూ చెల్లించడం ద్వారా గృహగ్రంథాలయంలో సభ్యులుగా చేరగలరని 1000రూ. చెల్లించడంద్వారా శాశ్వతసభ్యులుగా చేరగలరని ఆశిస్తున్నాము.

అంబేడ్కర్ రచనలను తెలుగులో ప్రచురించే పథకం 1991 జూలై నుండి ప్రారంభిస్తున్నాము.

చందా రుసుము పంపగోరు వారు కత్తి స్వర్ణకుమారి, నిర్వాహకురాలు, లోకాయత గృహగ్రంథాలయ సంస్థ పొన్నూరు 522 124 కు డి. డి. ద్వారా కాని మనియార్డర్ ద్వారాకాని పంపగలరని ఆశిస్తున్నాము. సభ్యులుగా చేరిన వారికి మేము ఇప్పటి వరకు ప్రచురించిన గ్రంథాలన్నీ పంపగలవారము.

—ప్రచురణ కర్తలు